వెల రు. 1-0-0.

ప్రథమముద్రణము.

ప్రకాశకులు:
కె. యస్. శాస్త్రులు సన్సు.

కాకినాడ:
శ్రీ పతిముద్రణాలయమున
ముద్రితము—౧౯౩౨.

ఈ దిగువ చిరునామాకు వ్రాసినను బడయఁగలరు.

శ్రీ తిరుపతి వేంకటేశ్వర గ్రంథమండలి,
కొంకుదురు, P. O.
రామచంద్రపురం తాలూకా,
ఈస్టు గోదావరిజిల్లా.

# తొలిపలుకు



ఇయ్యది నా మొదటినాటకము. ఆంధ్రపాఠకలోకమునకు చిరస్మరణీయులును, లవకుశ, కృష్ణలీలాద్యనేకనాటకరచయితలును మజ్జనకులును నగు కీ॥ శే॥ పండిత, కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి యాశీర్వచనమును, నామిత్రులును సుప్రసిద్ధనటకులును నగు సి. యస్. ఆర్. ఆంజనేయులుగారి ప్రోత్సాహమును నా యీ నాటకరచనకు కారణములు.

ప్రదర్శించిన తావులనెల్ల పండితపామరజనసమాదరణ వడసి, ప్రకృత మీనాటకము కోయంబత్తూరునందలి "సెంట్రల్ స్టూడియో" వారిచే "టాకీ" రూపము నొందినది. గ్రామఫోనువారి మన్ననల నందినది. శ్రీయుత ఆంజనేయులుగారి ప్రార్థనపై రచింపఁబడిన పాటలిందను బంధములుగా ముద్రింపఁబడినవి. పాటలు వ్రాయుటలో రా. మద్దూరి బుచ్చెన్నశాస్త్రిగారు నాకు సాయమొనర్చిరి. నాయభిప్రాయముల నైకొని, యాంధ్రదేశ మంతటను ప్రదర్శించి, భక్తతుకారామ్‌భూమిక నత్యంతనైపుణితో నభినయించి, నాటకమున కసమానవిఖ్యాతి నాపాదించిన మామిత్రులు ఆంజనేయులుగారి కే నెంతయు కృతజ్ఞుఁడ.

కాకినాడ,<br>25—8—37.

బుధవిధేయుఁడు,<br>కె. బాలసరస్వతి,

# ఉపోద్ఘాతము.



ఆంధ్రదేశమున నాటకసంఘముల సంఖ్య యల్పము. ఉన్న కొన్నియును నూతననాటకఖేలనమునకు గడంగకున్నవి. కళాభివృద్ధికి ప్రత్యేకనాటకసంఘము లావశ్యకములనువారిలో నేనును నొక్కఁడగుట, 'శ్రీలలితకళాదర్శమండలి' యనుపేర నొకసంఘమును స్థాపించి, నామిత్రులును, కవులును నగు శ్రీ కే. బాలసరస్వతిగారిని ప్రార్థించి యీ నూతన నాటకరచనకు ప్రోత్సాహకుండనైతి.

హైందవమతమాచారపాశబద్ధము — దురాచారాద్యకర్మాచరణైక భూయిష్ఠమైన హైందవమతోద్ధరణాకారణజన్ములగు మహనీయుల నెందఱినేని భారతమాత ప్రసవించినది. అట్టివారిలో తుకారా మొక్కఁడు.

తుకారామ్ మూర్తీభవించిన సహనదేవత — శాంత్యపరావతారము — నిజనిర్మలజీవితమున కర్మజ్ఞానయోగములు భక్తియందు సమన్వయము నొందుననని లోకములచాటిన మహారాష్ట్రభక్తుఁడు.

భక్త్యాత్మగతము — వర్ణాశ్రమధర్మములు బాహ్యలక్షణములు - భక్తబృందావనమున నహంకారమమకారములకును, జాతిమతవివక్షతలకును తావులేదని చాటిన మహనీయుఁడు.

సృష్టిప్రేమమయము — పరమేశ్వరునకును, జీవసంతతికిని గల బంధము ప్రేమబంధమే - ప్రేమ నిర్మలము — స్వార్థరహితము నిశ్చలమునై దైవమునందు సన్నిహితమై భక్తిరూపమునొందుటయే ప్రేమయుత్కృష్టత. అదియే స్వార్థపరతాతంత్రములఁ దవిలి, యీర్ష్యాదులకు లోనైన మానవునియధఃపతనమునకు కారణమగుచున్నది. అయ్యదీనాటకమున చక్కఁగ వ్యక్తీకరింపఁబడినది.

సంఘాభ్యుదయము—హైందవమతసేవ— ఆస్తికతాప్రబోధము యీనాటక ముఖ్యోద్దేశములు. 'హిందూమతోద్ధారణోత్సాహ'మే యీకథయందలి సారము. 'అందలి యమృతమే' భక్తిప్రబోధము. ఇందు శాంతి స్థాయిరసము. వీరశృంగారహాస్యరసములున్నైత మున్నను వస్త్వైక్యమున కెందును భంగము కలుగదు. 'దైవభక్తి- దేశభక్తి- రాజభక్తి- పాతివ్రత్యము- స్త్రీవిద్య- కర్మయోగము' మున్నగువానిని ప్రజలకు బోధించి నాటకకర్త కృతకృత్యత వడసెను.

ఇట్టియుత్తమనాటకమును రచించి- యెంతయో శ్రమగైకొని, మాయభ్యాససమయమున చెంతనుండి నాటకప్రదర్శనము జయప్రదమగునట్లు చేసిన కవిగారికి కృతజ్ఞుఁడను.

కోయంబత్తూరు,
1-9-37.

బుధవిధేయుఁడు,
సి. యస్. ఆర్. ఆంజనేయులు.

# ఈ నాటకమున వచ్చు పాత్రలు.



## —♦ పురుషులు. ♦—

1 తుకారామ్:—భక్తుఁడు- వర్తకుఁడు- కథానాయకుఁడు.

2 మహాదేవ్రుఁడు:—తుకారామ్ కుమారుఁడు.

3 గంగాధరపంతు:—మఠము—దివాను

4 శంభాజి:—భూస్వామి.

5 శివాజీ:—మహారాజు.

6 రామేశ్వరభట్టు:—బీదబ్రాహ్మణుఁడు.

7 గోపీచందు:—కోటీశ్వరుఁడు.

భటులు, పౌరులు, సైనికులు- కొత్వాల్.

## —♦ స్త్రీలు ♦—

8 రుక్మాబాయి:—తుకారామ్ పెద్దభార్య రోగబాధిత.

9 జిజియాబాయి:—తుకారామ్ చిన్న భార్య.

10 నీళాబాయి:—గోపీచంను భార్య.

11 జోకాబాయి:—గోపీచంను తల్లి.



# అంకితము.



దివంగతులును,

నిరవధిక ప్రేమమూర్తులును, నిరంతర

హరిధ్యానైకభక్తి సంభరితులును నగు

లక్ష్మీదేవమ్మ—పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రి

మామకమాతా- పితరుల పవిత్రస్మృతికి

భక్తిపూర్వక సమర్పణము.

శ్రీ రాజరాజేశ్వర్యైనమః—శ్రీ సుబ్రహ్మణ్యాయనమః

# నాంది.

..०◊०..

శా. శ్రీరామాకుచకుంభసంభృతలస
త్స్వేదాంబు సుశ్రేణి యే
పారన్ మౌక్తిక భ్రాంతి శ్రీనెలఁతుకా
రామప్రసాదాత్ముఁడై
రారాజత్కరుణాంతరంగవర సు
బ్రహ్మణ్యసంసేవ్యుఁడా
నీరేజాక్షుఁడు పాండురంగఁ డొసఁగున్
నిత్యాయురైశ్వర్యముల్.

శ్రీరాజరాజేశ్వర్యైనమః — శ్రీసుబ్రహ్మణ్యాయనమః

# భక్త తుకారామ్.

## ప్రథమాంకము.

### దృశ్యము: ౧.

సమయము:— ఉదయము.

[దేహూగ్రామము. తుకారాం గృహముందలి వసారా— రుక్మాబాయి యిల్లు తుడుచుచుండి— ఆయాసమున నాగును. ప్రవేశము: జిజియాబాయి నీటి బిందెతో— బిందెను క్రిందనుంచి— కోపమున]

(అనుబంధము. 1.)

రుక్మ—సోదరీ ! రుక్మా !—

జిజి—చాలు- చాలు ! అధికప్రసంగములు మాని యిక్కడ యూడ్చిన తరువాత ఇంద్రాణీనదికేగి నీటిని తెమ్మా ! వినుపించుచున్నదా ! ఊ !—

[జిజియా నిష్క్రమించుచుండ— ప్రవేశము: శంభాజి.]

శంభా—తుకారాం భావోన్మత్తుఁడు. ఆధ్యాత్మికవిషయముల యెట్టి యున్నతభావము లున్నవో, యెట్టిసమర్థత కలదో, ప్రాపంచిక విషయములందును, ధనసంపాదనయందును నంతయసమర్థత ! (రుక్మను చూచి) భర్తకు తగినభార్య ! రోగబాధితయైనను కలికాలమున నింకను పతిని దైవముగ భావించుమూర్ఖచిత్త !

[ప్రవేశము: శ్రోత లిద్దఱు.]

1 శ్రోత—రుక్మాబాయిగారూ! హరికథాకాలక్షేపమున కంతయు సిద్ధముగ నున్నదా?

రుక్మ—చిత్తము.

1 శ్రోత—ఓ శంభాజీగారూ! కాలక్షేపమున కేనా! సంతోషము! విసోబాగారూ! నేడు తుకారాం శేటుగారు స్వగృహముననే హరికథాకాలక్షేప మొనర్తురని యందఱిని నాహ్వానించితిరా! దామాజీగా రేమనిరి?

విసో—'ఇట్టివ్యర్థకాలక్షేపములకు వచ్చుటకు మేమేమి తుకారాంవలె బుద్ధిహీనులమా?' యనిరి?

1 శ్రోత—ఆఁ!- అల్లాగా! శంకరదీక్షితులవారు!

విసో—దీక్షితులవారా! 'శూద్రుఁడు హరికథ చెప్పువాఁడును, మేము వినువారునా?' యనిరి.

శంభా—అదే బాబూ! ఈ బ్రాహ్మణబ్రాహ్మణసమస్యయే మనదేశాన్ని నాశనం చేస్తోంది.

విసో—అదిగో గంగాధరపంత్ గారు!

[ప్రవేశము: గంగాధరపంతులు.]

శంభా—సాకారమందిన బ్రాహ్మణమతసనాతనాచారగర్వమే యీబ్రాహ్మణుఁడు. (ప్రకా) శ్రీ శ్రీ జగద్గురుమాస్వామీజీ బాబామఠాస్థాన విద్వాంసులు- గంగాధరపంతుగారు! దయచేయుఁడు!

గంగా—దయచేయుటేమయ్యా! ఇప్పుడందఱును హరిదాసులే యగుచున్నారు! ఇంచుక గొంతుక చక్కఁగనుండి పాడఁగలిగినశక్తి యుండినా చాలును- హరిదాసులమని తైతెక్క లాడుదురు. శాస్త్రజ్ఞానమా- శూన్యము! వేదాంతశాస్త్రజ్ఞానమా!- శశ

విషాణము! తుదకు భాషాజ్ఞానహీనమైన నున్నదండమా- మచ్చున కైన కాన్పింపదు.

[ప్రవేశము: జోకాబాయి.]

శంభా—జోకాబాయిగారూ! దయచేయండి! (జనాంతికము) ఇదియొక మరభినూనదేవత! తండ్రినుండి సంక్రమించిన ధనమునకంతయు తానే యధికారిణియగుటచే తనయేకపుత్రుని గోపీచందును, యిచ్చవచ్చిన ట్లాడించుచున్నది. (ప్రకా) జోకాబాయిగారూ! హరికథకేనా ?

జోకా—ఆఁ! హరికథలేమే రుక్మా! నీమగనికి తుకారాముకు బుద్ధిలేదేమే! కులవృత్తియైన వ్యాపారం చూచుకోక, హరికథలా! నీవైనా చెప్పలేకపొయ్యావా ?

రుక్మ—అమ్మా! వారికి బోధించుసాహసము నాకు కలదా! నా కేమి తెలియును ?

జోకా—అబ్బ! ఎంతనంగనాచివే! ఏమీ తెలియదుగా! పాపము! నీవు రోగిష్టివై మూలఁబడితివని, రెండవభార్యను జిజియాను చేసుకొన్నను, మాటలచే 'రుక్మా! రుక్మా!' యని రాత్రింబవళ్లు మగఁడు కాళ్ళచుట్టు తిరుగునట్లు చేయుటమాత్రము తెలియునుకాఁబోలు! అయినా యీదిక్కుమాలినహరికథ లెక్కడనుంచివచ్చాయమ్మా! మాకాలంలో వీనిని మే మెఱుఁగనే యెఱుఁగము!

గంగా—జోకాబాయిగారూ! ఛత్రపతిశివాజీమహారాజుగారు మహమ్మదీయపరిపాలనమున నున్నహైందవులకు దేశభక్తిశౌర్యాదుల నుద్బోధింప నీహరికథలను కల్పించెను. అమ్మహాకార్యసాధనానంతరమున నయ్యవి కేవల భక్తివైరాగ్యప్రబోధకములుగ నందందు వ్యాప్తినందుచున్నవి.

[శ్రోత— 'తొలఁగి చనరయ్యా!' యని.]

1 శ్రోత—వాఁడెవఁడు ?

గంగా—వాఁడా! రోహిదాసను పంచముఁడు! శూద్రమహాత్ముని హరికథకు పంచముఁడు శ్రోత!- తప్పేమున్నది?

జోకా—అరిపీడమ్మకడుపుబంగారుగాను! మాలాడే! అవ్వ! మాలాడు వీధిలోకి రావటమే! బాగుంది నాయనా! దేశసేవ అనుట చివరికి మాలకూడు తినుటంలోనికి వచ్చిందన్నమాట!- చాలుఁ బాబూ! యిలాంటిదానికి వచ్చింది నాకు బుద్ధితక్కువ!

(నిష్క్రమణము)

[ప్రవేశము: రోహిదాసు, పాదరక్షలనూడ్చుకొని.]

రోహి.—గీ. తొలఁగి చనరయ్య! యించుకదూరమేను
పంచముఁడ! నన్ను తాఁకిన పాతకమఁట
ముఖము లావల మఱలింపఁబోలు నయ్య!
చెప్ప లేదంచు నన్ను శిక్షింపవలదు!

1 శ్రోత—ఓరీ! మాలపీనుగా! ఊరిబయట చావలేకపోయినావా! నీమొహముమండ! నీ-

రోహి—మన్నింపుఁడు! స్వామీ! నాకు వంశమే లేదు. నాకు బుద్ధి వచ్చినప్పటినుండి యీవిశాలప్రపంచమున 'నా' యనువారు లేక, పశుపక్షులకున్న స్వాతంత్ర్యముసైతము లేక—తుదకు మాటాడించువారైన లేక, దినమేదోయొకనెపమున నిరాశాములచే కృశించుచునే యున్నాను!

1 శ్రోత—లేకున్న- యెక్కడైనా చావలేకపొయ్యావా!

విసో—ఆగవయ్యా! మనయిల్లా! మనవాకిలా! అదిగో తుకారా శేటుగారు వచ్చుచున్నారు! ఇష్టములేకపోతే ఆయనే పొమ్మంటాను.

[ప్రవేశము: తుకారాం- తలపై నొకమూట- చేత దండమును గొని యొకముసలిని రక్షించుచు- వెంట కొందఱు శిష్యులు- మహాదేవుఁడును నుందురు.]

తుకా——(అందఱి నుపవేశింపఁజేసి)

"శ్లో. శ్రీకల్యాణాత్మకశుభకరం శార్ఙ్గచాపాభిరామం
లక్ష్మీవిద్యుల్లసితమతసీగుచ్ఛసచ్ఛాయకాయం
వైకుంఠాఖ్యం, మునిజనమనస్స్వాతకానాం శరణ్యం
కారుణ్యాపం త్రిదశవినుతం పాండురంగం నమామి."

(అనుబంధము. 2.)

తుకా——మహామహులారా! ప్రకృతము భారతవర్షమున మహమ్మదీయ ప్రభుత్వ మేర్పడినది. కలికాలమాహాత్మ్యమున ఔరంగజేబు పాదుషా హిందూమతమును నిర్నామ మొనర్పవలయునని ప్రబలప్రయత్న మొనర్చుచున్నాఁడు. హిందూమతమును, ధర్మ వేదబ్రాహ్మణదేవతారాధనములును ప్రపంచమతరంగమున తమప్రత్యేకవ్యక్తిత్వమును సాధించుకొనుటకై భగీరథప్రయత్న మొనర్పవలసియున్నవి భారతదేశమునకంతయు మాణిక్యము నాబరగు మనమహారాష్ట్రదేశమున కర్మయోగియు, హైందవ ధర్మపునరుద్ధరణదీక్షాబద్ధకంకణుఁడును నైన శ్రీఛత్రపతి శివాజీ మహారాజు కాలగర్భమున జనించి, తనకార్యనిర్వహణమునకై వేచియున్నాఁడు. మనసాయ మపేక్షించుచున్నాఁడు. తనువులు క్షణభంగురములు. సోదరులారా! మన మెంతప్రయత్నించినను, తుదకు భార్యాపుత్రసేవకాదులచే పరివేష్టింపఁబడి తలుపులకు తాళములువైచినను, మృత్యుదేవత మనల తననోట వైచికొనక తప్పదు. అట్టిచో, రోగబాధల తల్లడిల్లి, మంచమునఁబడి చచ్చుటకన్న పవిత్రతరవిశ్వసేవామహోద్యమమున పెర

వారు తలలూప, తమవారు 'భళీ! భళీ!' యన, కీర్తికాయముల నీలోకముననే యుంచి, కృతకృత్యతాసంతోషమున తనువులు వదలుట మేలుకాదే! రండు! విశ్వసేనకై కంకణమును ధరింపుఁడు.

గంగా—వలదు! శూద్రుఁడు బ్రాహ్మణుల కుపదేశించువాఁడా!

తుకా—అయ్యలారా! ద్వేషమాత్సర్యముల విడనాడుఁడు. జాతిమత వివక్షతలు, ధనధాన్యవిభవములు మానవకల్పితప్రభేదములు!

సీ. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రకు లేక
గర్భజాతు లటంచుఁ గాంచరయ్య!
అన్నలు ద్విజులు- శూద్రాదుల, తమ్ముల,
బలుప్రేమ చూచుటే భాగ్యమయ్య!
గుణముచే, క్రియలచే, తనరు వర్ణములెల్ల
గుణమున్న గ్రహియింప కూడునయ్య!
ద్విజుఁడు దుర్గుణుఁడైన తెల్వి శూద్రుఁడు కాఁడె?
సుగుణి శూద్రుండు భూసురుఁడు కాఁడె?

గీ. భరతభూమాతసుతులు సోదరులు కారె?
తనయులలో పితరులకు భేదంబు కలదె?
కలత పోనాడి యైక్యంబు గాంచరయ్య!
అపుడు మనదేశ మభివృద్ధి నందునయ్య!.

గంగా—చాలు! చాలు! తుకారాం! నీ కింకను పిచ్చి వదలలేదా? శివాజీమహారాజు బాహుబలమును, రాజనీతిజ్ఞతయు, సమర విజయములును రాజ్యస్థాపన మొనర్చుఁగాక! నీహారికథలు విశ్వసేవాదులును నతని కేల?.

తుకా—బ్రాహ్మణేంద్రా! పశుబలమును, రాజనీతిజ్ఞతయు తాత్కాలిక సమరవిజయ మొసంగఁగల్గుఁగాక, యేకాలముననైన- యెవ్వ

రిచేనైన కేవలపశుబలముచే సుస్థిరధర్మరాజ్యసంస్థాపన మొన ర్పఁబడినదా? సుస్థిరధర్మరాజ్యలక్ష్మి యెప్పుడును ప్రజలహృద యప్రేమసింహాసనముపై నెలకొల్పఁబడవలయు! భక్తిజ్ఞానకర్మ సమ్మేళనమహాశక్తి యొక్కటియే భారతదేశమును, తన్మూల మున ప్రపంచమును నుద్ధరింపఁగలదు.

గంగా—అయిన విశ్వసేవకై సర్వమును త్యజింతువా?

తుకా—సంతోషమున—

గంగా—ఆఁ!- నీజ్యేష్ఠకుమారుఁడు మహాదేవుడు రోగశయ్యపై నుం డఁడా?

తుకా—నిక్కమే; కాని- మహాత్మా! రోగశయ్యకును, అంత్యశయ్య కును వ్యవధానము లేదా? ఆవ్యవధానమున—

గంగా—గంతులు వై చెదవు. సంతోషమే- నీవు లేనితఱి వ్యాపార మున నష్టము వచ్చిన—

తుకా—(మందహాసమున) నేనిప్పు డింటున్నమాత్రమున లాభమేవచ్చు చున్నదా?

గంగా—గాదా మఱి! అడిగినవారికెల్ల నంగడిలోనున్న వస్తువుల దాన మొనరించిన లాభమేకదా! కాని, కాశరోగబాధితయగు నీపెద్ద భార్య రుక్మ- ఋణదాతలు- జిజియా!

తుకా—హా హా హా! స్వామీ! ఎంతవెఱ్ఱివారలు!—

సీ. భవరోగవైద్యుఁడౌ పాండురంగఁడె యుండ
వెలఁది పుత్రుల రోగభీతి యేల?
కర్మబద్ధంబులై కలిమిలేములు కల్గ
వాణిజ్యనాశంపుభయ మదేల?
తనుదానె రక్షించుకొనలేనిజడుఁడు తా
'నాది' 'నే' ననుమోహ మందనేల?

హరి, దేశజనని, సద్గురుగుణంబుల సైచు
చెంటి కీర్తి బాధచింత యేల ?

[ప్ర[illegible]: జిజియా- వెనుకనుండి]

గీ. కాంత సమసిన శ్రీముక్తికాంత లేదె ?
ధనము నశియింప సత్కీర్తిధనము లేదె ?
విశ్వసేవయే నాదీక్ష ; వెలఁది, సుతుఁడు,
విశ్వసేవయె నావృత్తి ద్విజవరేణ్య !.

జిజి—(చీపురుతో) ఆఁ! ఆఁ- అందఱును చావవలయునా ! మూర్ఖులారా ! పోయెదరా ! లేదా ! (రోహిదాస్, గంగాధర, జిజియా, రుక్మ, తుకారాం,మహదేవులు తప్ప నందఱును పోవుదురు.)

తుకా—(గీతమందలి 'విశ్వసేవయెనాదీక్ష' యని చదువుచుండును.)

జిజి—[చెంత కేతెంచి] ఏమి ! వినుపించుచున్నదా ?

తుకా—గీ. 'విశ్వసేవయే నాదీక్ష- వెలఁదిసుతుఁడు' (జిజియాను చూచి దిగ్భ్రాంతుఁడై) దేవీ- నీవా ! ఆఁ- విశ్వసేవయే- ఆఁ కాదు- నామిత్రులెల్ల రేరీ ? వారిని మనగృహమున కాహ్వానించి—

జిజి—సత్కరింపవలయునా ! ఇపుడే కొంతవఱ కైనది. కాని, పతిదేవుఁడుగారూ ! గోపీచందుబాకీ—

తుకా—వారు చాల భక్తులు దేవీ !—

జిజి—గోపీచందువద్ద వ్యాపారానికై కొన్న నాల్గువేలనిమ్మకాముల బాకీ—నాథా !-

తుకా—అనవరతవిశ్వసేవాపరాయణులు జిజియా !

జిజి—రేపివ్వకున్న మరియాద నిలువదు. మనయాస్తినంతయు అమ్మి కైకొనును.

తుకా—నిరతస్వార్థత్యాగభూషితులు జిజియా !

జిజి—(తుకారాముభుజముమీఁద చేయివైచి యూఁపుచు) ఇంత యవివేకమా!

తుకా—దేవీ!- నాకు—

జిజి—నాథా!- మీకు- బుద్ధి చాలదు-

గంగా—నిక్కముగ చాలదు- ఆఁ- శేటుగారూ! మఱునాఁడు మీ యింట జగద్గురు శ్రీమాన్ స్వాజీబా బాస్వాములవారికి గురుపూజ! జ్ఞాపక మున్నదా?

తుకా—భాగ్యము!

గంగా—గురుపూజావిధాన మెఱుంగుదువు కదా! వినుము: స్వాము లవారి వెంట నూర్గురుశిష్యు లుందురు వారికి ఘృతశర్కరాగు లతో సరసపక్వాన్నముల కర్పిష్టులగు తిరువైష్ణవులచే సిద్ధప ఱుపవలయు. మఠపరివార మేఁబది- పరివారజనుల యాశ్రి తులు నాల్గువందలజనులు- అశ్వములు రెండువందలు- గజము లేఁబది- డెబ్బది యొంటెలు- నూఁటయేబదియెద్దు- దినమునకు వీనికన్నిఁటికిని మూఁడువందలవరహాలు కావలయును. పైన పాద పూజాకట్నము- యోగ్యతాధీనము. ఇఁక నాస్థానవిద్వాంసుఁ డనగు నాకట్న మెఱిఁగియేయుందువు కదా!- ఒక్కవేయినూ టపదహార్లు! తరువాత- తిరుదాసులు- తిరుదాసదాసులు- తిరుదాసదాసదాసులు—

మహా—తిరుగాడిదలు- తిరుకుక్కలు- ఉ- చెప్పుఁడు. చాలించితి రేల?

గంగా—ఓయీ! కన్నులు కాన్పింపవా! శూద్రుఁడవై మఠాధిపతుల దూషింతువా?

మహా—ఏమయ్యా! శూద్రుఁడు శూద్రుఁ డనుచున్నావు! శూద్రుఁడు మానవుఁడు కాఁడా! వాని కింద్రియజ్ఞానము లేదా?

గీ. అవని, తిఱిపెంపుతిండి సౌఖ్యంబు మఱఁగి
హాయిగ భుజించి సోమరులై మనంగ
చదువు కలవారు సేయు మోసంబు గాక
ద్విజుల శూద్రుల హరియె కల్పింప లేదె!

గంగా—ఆ- పాకము ముదురుచున్నదే! తుకారామ్! నీయభిప్రాయ మును నిదియేనా?

తుకా—క్షమింపుఁడు. ఒక్కమాట! సర్వసంగపరిత్యాగులగు సన్న్యాసులకు జపతపాదులయందు శ్రద్ధ శూన్యము! బ్రహ్మజ్ఞానమన్న నో కలలోనివార్త! సాధనచతుష్టయసంపత్తియం దాసక్తి యున్ననో పూర్ణానుస్వారము! కాని, స్వామీ! సన్న్యాసులకు సపరివారభోగములుమాత్రము కావలయునా?

గంగా—పండితునిబోలె ప్రజ్ఞావచనముల పలుకసాగితివి! నీవు శాస్త్రముల నభ్యసించితివా? గురూపదేశ మందితివా! లేక భావ్యశాంతి యొనర్చితివా?

తుకా—ఆర్యా! జ్ఞానార్థకమగు విద్యయంతయు శాస్త్రాదిగ్రంథముల యందే యిమిడియున్నదా?

గంగా—అబ్బే! యెక్కడిది? రాళ్ళు చెట్లు గుట్టలు చచ్చినశవముల యందును యిమిడియున్నది. ఔనా?

తుకా—నిక్కముగ—సందియ మేల?

గంగా—భళి! శేటుగారూ! అయిన తాము రాళ్ళశాస్త్రపండితులా! ఏఁదీ? తాము చెట్లనుండి నేర్చినవిద్య?

తుకా— వింటురా?

సీ. జాతిభేదము లేక జనుల కాశ్రయ మిచ్చి
సర్వసమత్వంబు చాటు తరులు!

తనువుపై మన కింతతనుకంబు తగదంచు
చలి యెండ వానల సైఁచు గిరులు !
రేపు మాపటికంచు వాపోవవలదంచు
విహంగముల్ సంతుష్టివిద్య గఱపు !
జగము నిత్యము కాదు; సంసార మది భ్రాంతి
యని ప్రాణముల పీడి చనెడువారు !
గీ. 'నాది' 'నే' నను భ్రాంతి యనర్థ మంచు
నేర్పు ప్రకృతిజనని బాష్పవృష్టిఁ దెలుపు
ప్రాణి సుజ్ఞాన మార్జింప ప్రకృతియొకటె
పాఠశాల ! సద్గురుఁడు శ్రీపతియె కాఁడె ?

గంగా—గురుద్రోహీ ! నిక్కమా ! వీరేనా నీగురువులు ? కానిమ్మా ! చచ్చినశవములనే పూజింతువఁట ! ఇదే నీకు కులబహిష్కార శాపము ! కులమునకు బాహిరుఁడవై - బంధుగులకు దూరుఁడవై - ఆపాండురంగనిపూజ కనర్హుఁడవై —

జి—ఏమయ్యా ! బెదరింతువా ! ఎన్నఁడు బ్రాహ్మణులు స్వధర్మములకు దత్తాంజలి యొసంగి, పరకీయధర్మముల నాశ్రయించిరో యానాఁడే. వారి తేజశ్శక్తియు, వాక్సిద్ధియు నంతరించెను. సర్వప్రాణులకును నాపాండురంగఁడే జనకుఁడు ! దైవము. అందఱిని యాపాండురంగఁడే సృజించెను !

హి—(సమీపించుచు) అమ్మా ! చండాలులనుకూడ నాపాండురంగఁడే సృజియించెనా ?

హా—ఛీ ! ఛీ ! చండాలాధమా ! ఇలుసొచ్చితివా ! యింత యహంకారమా !- అధమా—

హి—క్షమింపుఁడు. స్వామీ !—

ఉ. ఎవ్వఁడు పాండురంగవిభుఁ? డెచ్చట నుండు? జగంబునంతయున్
నివ్విధి పెంప నొంపఁ గత మెయ్యది? బంధుగు లెవ్వ? రాతనిన్
యెవ్వరు బ్రోచువారు? కులమెయ్యది? పంచముఁడో? ద్విజుండొ? తా
నెవ్వఁడొ? వేఁడువాఁడ వచియింపరె! రంగని చేరుమార్గమున్!

తుకా—ఓయీ! మందభాగ్యుఁడా! (విగ్రహమును చూపుచు) అతఁడే పాండురంగఁడు- కాని నీవంటరానివాఁడవు-

గంగా—భళి! భళి! ఇది బ్రాహ్మణేతరమతనిర్ణయచంద్రిక! చచ్చిన శవములనుండి నేర్చిన జ్ఞానముకాంచఁబోలు! బ్రాహ్మణు లేమియు ధికులని యధిక్షేపించుశూద్రునకు పంచముఁడు పనికిరాఁడు.

మహా—ఓరీ- పోయెదవా! లేదా?

తుకా—మహాదేవా! ఆనిర్భాగ్యు నేల బాధింతువు?

మహా—నీ వేమి చెప్పునది? పడియుండు మావల!- ఉఁ-

రుక్మి—కుమారా! తండ్రి నవమానింతువా!

మహా—ఆహా! యేమితండ్రి!—

గీ. ఆత్మకులగౌరవాదుల నట్టె వీడి,
స్వాభిమానంబు త్యజియించి, బ్రతుకరణి
పరులదాస్యంబు సలుపుచు, స్వత్వమెల్ల
ధరణి పాడుఁజేయు నితఁడు తండ్రి యగునె?

రోహి—(విగ్రహమును గాంచి) ఇతఁడేనా రంగఁడు!

మహా—అఁ ఆఁ- చండాలాధమా! పాండురంగవిగ్రహమును తాఁకితివా! ఉదయమున నీ వెక్కడ దాపరించితివిరా! (మీఁదికిఁబోవ)

రోహి—అయ్యా! అయ్యా! క్షమింపుఁడు. మీశిక్షల భరించుశక్తి యైన నాకీనాఁడు లేదు.

గీ. నాల్గుదినములనుండి యాహార మెఱుఁగ
వీడనున్నవి ప్రాణముల్ వేఁడికొందు;
క్రిముల పశు పక్షి మృగ కీటకములఁ గాంచు
కరుణ నావంతనను జూడ కలుషమగునె?

మహా—(కొట్టుచు) పారవేయు మావిగ్రహము నంక.

తుకా—(చుక్కను పీడి నిలిచి- మనోసంఘర్షణాయాసమున) దుర్భరము! దైవమా! ఈదురంతావలోకనము దుర్భరము!

గోహి.—అయ్యో! అయ్యో! (అని పోవుచుండ- మహాదేవుఁడు కొట్టుచుండును.)

తుకా—మూర్ఖా! (మహాదేవుని పట్టుకొని) నీవు నాతనయుఁడవేనా! (త్రోయును- మహాదేవుఁడు క్రింద పడును- గోహిందాసు నిష్క్రమించును.)

జిజి—ఆఁ- ఆఁ!- అవివేకీ! మూర్ఖా! కన్నకుమారునే చంపుదువా! (ఉత్తరీయమును బట్టి మెడ నులుముచు) నిన్నేమిచేసినను పాపము కలుగునా!

మహా—అబ్బ! అయ్యో! బాధ! పరులకై కుమారుల చంపు తండ్రు లుందురా! కఠినాత్మా! నాతోపమాయెనా! నీకన్నులు చల్లవడియెనా! అందఱిని చంపి సుఖముగ నుండఁదలఁచితివా?

గంగా—తుకారామ్! ఇది చచ్చినశవములశాస్త్రములో నేపరిచ్ఛేదము?

తుకా—ఇదియా! స్వామీ! సంసారభ్రాంతివిచ్ఛేదనపరిచ్ఛేదము! దారసుతాదు లనుమమకారలతను గ్రుంచుపరిచ్ఛేదము.

గంగా—ఏమీ! యీతాడనములా?

తుకా—అవి తాడనములా! స్వామీ! తనువుపై నాకుఁగల మమకారరూపరోగమును బాప దయామతి నాసర్వేశ్వరుఁ డొసంగిన దివ్యౌషధరాజములు! మామకవిశ్వసేవామహోద్యమమున

దేశమందలి ప్రజలబాధలఁ బాప ప్రయత్నించుటకుముందు బాధాస్వరూప మిట్టిదని యీసాధ్వి కల్పించిన యుపదేశసాధనములు. ఆత్మశుద్ధికై దేహశుద్ధితో ప్రారంభించి నాతనయుఁడ్డే నామోక్షసౌధమునకు నిర్మించిన సోపానములు!

జిజి—చాలు చాలు! ఈయుపన్యాసములు చాలించి యిఁక నుకాణమునకు వెడలవలదా? ప్రొద్దెక్కినది. (రుక్మతో) నిలిచితివేల దయ్యమా! ఊఁ—

రుక్మ—నాథా! పాపము! మీదేహ మెంత—

జిజి—అబ్బో! యెంతపతిభక్తి! అపరసావిత్రీదేవి! చాలు జగజంతా! గైకొమ్మాంబింపెను! ఊఁ! తీసుకొనవేల?

తుకా—రుక్మా!—

రుక్మ—నాథా!—

జిజి—(అనుకరించుచు) 'రుక్మా! నాథా!' ఏమిసరసము!

(అనుబంధము. 3.)

య వ ని క ప డు ను.

---

దృశ్యము. ౨.

సమయము: సూర్యోదయానంతరము 2 ఘడియలు.

[దేహూగ్రామమునందలి యొకవీధి—ప్రవేశము: పాండురంగ విగ్రహముతో రోహిదాసు.]

(అనుబంధము 4.)

రోహి—రంగా! నన్ను తాఁకుటచే నీవు మైలపడితివి! అంటరాని వాఁడ వైతివి! రంగా! నిన్నిఁక యెవ్వ రాదరింతురు? ఎవ్వరు పూజింతురు?

[ప్రవేశము; గంగాధరపాత్]

గంగా—ఓరీ! అధమా! యిదియేమి? యుదయమున నూరివీధుల నూరేగుట కుపక్రమించితివి.

రోహి—స్వామీ! నామిత్రుఁడు చలికి తాళఁజాలక వణఁకుచుండ నిచ్చట వస్త్రములిచ్చు తావున్నదని విని వచ్చితిని.

గంగా—నీమిత్రుఁ డెవఁడు?

రోహి—నారంగఁడు?

గంగా—మూర్ఖా! నీరంగఁ డెవఁడు?

రోహి—నామాలరంగఁడు స్వామీ!

గంగా—అధమా! పాండురంగని మాలవానిఁ జేసితివా!

రోహి—క్షమింపుఁడు స్వామీ! మానవులే నన్ను తాఁకిన మాలవా రగుదురని మీ రనుటచే మిమ్ముల సృజించిన నీపాండురంగఁడు నన్ను తాఁకిన మాలవాఁడు కాఁడా?

గంగా—చాలు నిఁక! ఆవిగ్రహముతో నేమిచేసికొందువు?

రోహి—ఆడుకొందును. మాట్లాడుకొందును. కష్టసుఖముల చెప్పుకొందును. ప్రేమింతును. కోపింతును. మానవులందఱు నన్నే వగించినను, మానవాకృతినున్న యీపాండురంగఁడే నామిత్రుఁడు- నాబంధువు- నాస్వామి- నాసేవకుఁడు—

గంగా—నీమోహము! నీతెల! మూర్ఖా! పాపాత్మావల! అదే! తుకారాం శేటుమకారము! (నిష్క్రమము.)

రోహి—(పోవుచున్న గంగాధరునిఁ జూచుచు)

గీ. దేవుఁ డని నిన్నుఁ గొల్తు రీద్విజులు, రంగ!
ద్విజవరేణ్యులకే నీవు దేవుఁ డగుదొ?
ధరణి చండాలులకు గూడ దైవ మగుదొ?
పంచములకు దైవమె లేఁడొ? పలుకుమయ్య!

(నిష్క్రమము.)

---

## దృశ్యము 3.

### తుకారాం దుకాణము.

[దుకాణమున నుపవేశించి తుకారాము పాడుచుండును. ప్రవేశము: పామరులు కొందఱు- దుకాణమునందలి వస్తువుల వెలనడిగియు తుకారాము పాడుచు ప్రత్యుత్తర మివ్వనందున తమకుతోచిన దమ్ము పడవైచి కొందఱును, యేమియు నివ్వకయే కొందఱును, వస్తువుల గైకొని పోవుచుందురు- మాధవుడు గోవిందాసు దీనిని చూచుచుండును.]

తుకా— (అనుబంధము. 5.)

[ప్రవేశము: జోకాబాయి]

జోకా— శేటుగారూ!

తుకా—(త్రాసును తదేకదృష్టితో చూచుచు మౌనమున నుండును.)

జోకా—తుకారామ్ శేటుగారూ!

[ప్రవేశము: గంగాధర పంతులు]

గంగా—తుకారామ్!

తుకా—(నిట్టూర్పు వదలి) మఱియొక దినము! అల్లదే బాలభానుడు మానవజీవితగ్రంథమందలి మఱియొకపుట సుకృతమునకో, సుకృతేతరకార్యాచరణోల్లేఖనమునకో సంసిద్ధముగ నున్నదని చాటుచున్నాడు! (క్షణము నిశ్చేష్టుడై- తల పంకించి) చిత్రము! మాయ!! ఊహాతీతము!!

గీ. జననమందిన ప్రాణులు చావ నేల?
చచ్చువారుండ- మఱియు నీజనన మేల?
త్రాసుగతి సృష్టిభేదంబు దాల్ప నేల?
శౌరి కీవిశ్వసంసారభార మేల?

జోకా— శేటుగారూ! మాకీపట్టువస్త్రములు కావలసియున్నవి.

తుకా—ఈపట్టువస్త్రములా?

గంగా—తుకారామ్! ఆపట్టువస్త్రములు మాగురువుగారికి కావలయును. వానికై యే స్వాములవారు నన్నంపిరి.

జోకా—వీలులేదు. వానికై నేను నిన్ననే వచ్చాను. అదీగాక మాకితఁడు బాకీ—

గంగా—ఏమిా! విధవకు విలువగల వస్త్రములు కావలయునా?

జోకా—కాదు-కాదు- సన్న్యాసికి జలతారువలువలు కావలయుకాఁబోలు! బ్రాహ్మణా! నే నెవ్వరో యెఱుంగుదువా! కోటీశ్వరుఁడగు గోపీచందు తల్లిని!

గంగా— నే నెవ్వరో యెఱుంగుదువా! జగద్గురుమాస్వామీజీబాబాగారి మఠమున కాస్థానవిద్వాంసుఁడను.

జోకా—మిామఠము లన్నియు మముఁబోలుకోటీశ్వరుల దానధర్మాలపై నాధారపడియుండుట జ్ఞాపకము లేదుకాఁబోలు!

గంగా—మిాభోగభాగ్యము లన్నియు నుముఁబోలుభూసురశ్రేష్ఠుల యాశీర్వచనములపై నాధారపడియుండుట జ్ఞాపకము లేదుకాఁబోలు!

తుకా—ద్విజసత్తమా! అమ్మా! శాంతింపుఁడు! స్వామిా! భూసురులకు సత్వగుణముకదా యుండవలయు! ఎన్నిశాస్త్రములు చదివిననేమి? ఎన్నియజ్ఞయాగాదికర్మల నాచరించిననేమి? కామక్రోధాదుల జయింపలేనివాఁడు—

గంగా—ఆఁ- ఆఁ!- ఏమంటివి?

తుకా—అయ్యున- విలువగల వస్త్రధారణవిషయమున విధవలును, సన్న్యాసులును సమానులే!

గంగా—మూర్ఖా! స్వాములవారిని విధవతో పోల్చితివా?

తుకా—ఆర్యా! ప్రాపంచికవిషయభోగములయం దంతయేకదా!

[ప్రవేశము: యిరువురు రాజభటులచే నీడ్వఁబడుచు, శృంఖలాబద్ధుఁడైన రామేశ్వరభట్టు.]

రామే—ధర్మాత్ములారా! దానమొనర్పరా!

తుకా—స్వామీ! అభివాదనములు! ఈశృంఖలము లేమి? తమ కీదుస్థితి యేల?

రామే—అయ్యా! ఈదీనునిచారిత్రము మిక్కిలి విషాదకరము. నాది దక్షిణదేశము. సంసారసాగరమున మునిఁగి, కన్నుఁ గానక, నేను పదివేలనిష్కములు ఋణపడితిని. ఋణదాత లాధనమునకై రాజుచెంత నభియోగమును దెచ్చిరి. రాజాజ్ఞచే మాస్వత్వమంతయు ఋణదాతల యధీనమయ్యె. అప్పటికిని ఋణము తీఱనందున నన్నీ యయోమయశృంఖలముల బంధించి రాజభటుల కప్పగించిరి. ఈరీతి తిరిగి యాచనావృత్తిచే లభించినధనమును ఋణవిముక్తికై వీరి కొసంగుచున్నాఁడ! ఋణవిముక్తి యగువఱ కిట్లే "గ్రామేకరాత్రం, దిన మేకభుక్తం" యనునట్లు భార్యాపుత్రులతో తిరుగుచున్నాఁడ!

తుకా—అయ్యో! వృద్ధులే! ఎంతకాలమునుండి యిట్లు తిరుగుచున్నారు?

రామే—పండ్రెండువత్సరములనుండి.

తుకా—అయ్యో! ఎంతకష్టము! (ధనపేటికను గొని)

గంగా—ఆఁ- ఆఁ!- తుకారామ్! నీకు పిచ్చిపట్టినదా యేమి? ఆధనము నీయది కాదు. గోపీచందుగారిది గోపీచందు అప్పుతీర్చుటకై దుకాణమునందలి ధనము చాలకున్న- అభిమానైకధనయగు నీభార్య జిజియాబాయి తనపుట్టినింటివారిచ్చిన భూషణములన్నియు నమ్మి నీ కిచ్చినధనము.

తుకా—అయిన?

జో శా—అయినా ?—నీకు మతి లేదా? ఈదినము మాఋణము తీర్చువాయిదా! ఆఁగుము! నే నిప్పుడే పోయి నీభార్యను పంపెద. నాకుమారుఁడును రాఁగలఁడు!

(నిష్క్రమణము.)

గంగా—తుకారామ్! గోపీచందుబాకీపైక మిప్పు డివ్వకున్న మీావస్తువులన్నియు నమ్మియైనఁ గైకొనును! తెలిసినదా ?

తుకా—అయిన ?

గంగా—మూర్ఖా! పిదప నీవ ర్తకమునకు పెట్టుబడి నిచ్చువారు ?

తుకా—స్వామీ! లోకమున వర్తకములేనివారందఱును చచ్చుచున్నారా!

గంగా—అయిన నోవైరాగ్యశిరోమణీ! రేపు మీాయందఱిగతి ?

తుకా—రేపా ?—ద్విజచంద్రమా!

గీ. తనువు, తమవారి వదలి, నిత్యంబు ప్రాణు
లెందొ ? యెచ్చటికో ? యెట్లొ ? యేగుచుండ
'రేపు రే' యంచు పలికెదు 'రేపు' వఱకు
బ్రదుకఁగలవార లెవ్వరో ? పలుకఁగలవె ?

గంగా—ఈవేదాంతవచనములు కుక్షి నించునా ?

తుకా—నిక్కమే- కాని- అదిగో!—

గీ. ఆకసంబున తిరుగు విహంగతతులు
మఱుదినంబున కని దాచుమందసములు
కలవె ? వానికి ఋణ మిచ్చు ఘనులు కలరె ?
భుక్తి లేక చచ్చెడివారు భువినిగలరె ?

భటులారా! యిదియే మీాఋణధనము. ఇఁక బాకీ లేదుకదా! పాప మీాసాఉనికొంటు తిరుగుచు చాలశ్రమ గైకొంటిరి! ఇదియే యీాధనము బహుమానముగఁ గైకొనుఁడు! పాపము!

మీావస్త్రములు జీర్ణములైనవి. ఇదిగో యీనూతనవస్త్రములం గొని యథేచ్ఛం జనుండు. మీాకు శుభం బగుంగాక ! (భటులు రామేశ్వరభట్టుసంకెలలం దీసి నమస్కరింప) ద్విజచంద్రమా ! మీాఅప్పు తీఱినదికదా ! యిదిగో యీనూతనవస్త్రముల ధరింపుండు. ఈధనము గైకొని కుటుంబపోషణ మొనర్చికొనుండు.

రామే—అయ్యా ! నాయుదరపోషణకు—

తుకా—ఆం— నిక్కమే- మీారు నాకార్యభారము నంతయు నిర్వహింపుచు మాసమున నిరువదినిష్కముల వేతనము గైకొనుండు.

రామే—ఆర్యా ! మీాయుపకార మెన్నిజన్మములకుం దీర్పంగలను !-

తుకా—స్వామీ ! యిది యీపాండురంగని ధనము. పాండురంగస్వరూపులగు మీారు గైకొంటిరి. ఇందు నాయుపకృతి యేమున్నది ? ఉపకారమే యున్నదందురా ! యేదీ ? ఆశృంఖలముల నాకొసంగుండు !

రామే—(ఆశ్చర్యమున) ఏల ? (సంకెలల నొసంగుచు.)

గంగా—ధరించి యున్మాదవైద్యశాల కేగుటకు ! నీ కెందుకయ్యా !

[శృంఖలముల పేటికయందుంచుచుండ రామేశ్వరభట్టు పోవుచుండును. వేఱొకవైపునుండి ప్రవేశము: జిజియా గోపీచంగాలు.]

తుకా—(పోవుచున్న రామేశ్వరుని చూచుచు) ఇంక నేమియు బాకీ లేదు కదా ! ఋణము తీఱినదికదా ! ఇంక సుఖముగ పోయిరండు !

గోపీ—జిజియాబాయిగారూ ! నేంటుమాత్రము మాధనము సంపూర్ణముగ నిచ్చితీఱవలయు. తరువాత—

జిజి—అయ్యా ! సంపూర్ణముగ నాఋవేలనిష్కములను నిచ్చెదము !

గోపీ—అదిమాట! వ్యవహారములో నెప్పుడు 'కరతలామలకన్యాయ'ము శ్రేష్ఠము.

జిజి—ఇదిగో! నాథా! యేదీ! ధనపేటిక! (చేతినుండి గ్రహించి) చందుగారూ! ఇదిగో! మీధనము! (మూడకయే సంకెలల నిచ్చును.)

గోపీ— ఆఁ- ఆఁ- యిదియేమి? (సంకెలలు క్రిందఁబడును.)

జిజి—ఆఁ- నాథా! నాథా!! ఏదీ! ఏదీ ధనము!

తుకా—(క్రిందపడినసంకెలలఁ జూచుచు) ధనమా! బంధనమా! అదియే ప్రశ్న!

గోపీ—మోసము! మోసము! ఇదియంతయు మాధన మపహరించుటకై పన్నినతంత్రము! అంతయు 'పయోముఖవిషకుంభన్యాయ'ము! నమ్మను. ఏవీ పద్దుపుస్తకములు! (అంగడినంతయు చూచి) లేవు! చిఠాఆవర్జపుస్తకములు లేవు. తుకారామ్! పద్దుపుస్తకముల దాచి దివాలాతీయుటకు యత్నించుచున్నాఁడవా?

తుకా—సోదరా! నీ కేపద్దు కావలయును?

గోపీ—నాకా? నిలాభముపద్దు- ఖర్చుపద్దు- నిలువధనముపద్దు.

తుకా—ఇవిగో—

సీ. సంసారమను పణ్యశాలలో దినమెల్ల
జనులుసంపాదించు 'ధనము'పద్దు!
పాపపుణ్యంబులన్ వస్తు లమ్మిన వచ్చు
ప్రతిఫలరూపలాభంపుపద్దు;
మ మ్మొందు సృజియించి మమతనారయుతాద్రి
నారి, పెట్టుబడి కిచ్చు నప్పుపద్దు;
తుదిసమయంపు నయ్యుదనున ప్రాణులు
వెనువెంటఁ గొనిపోవు ధనముపద్దు;

గీ. నాకు, నీకును, సర్వజీవాళి కవని
కర్మఋణశేషముచు దీర్పఁగఁ దలఁచె వెల్పు
భవ్యరోజు, చిత్రాయు, నావర్జ యగుచు
పొల్చు శ్రీభగవద్గీతపొత్త మిదియె!
(భగవద్గీతపొత్తమును చూపును.)

గోపీ—మూర్ఖా! నిన్ను న్యాదవైద్యాలయమున కంపవలయునా? కారాగారమున కంపవలయునా? నీవు చోరుఁడవు! నీజన్మమే ఋణమయము!

తుకా—సత్యము!

గోపీ—నీవు పుట్టి పెరుఁగుట ఋణమునం దే- నీనిలు వెల్ల ఋణమయము!

తుకా—నిక్కువము.

గోపీ—నీవు- నీవంశము- అంతయు ఋణమయమే!

తుకా—సత్యమే. కాని, సోదరా! నీకుమాత్రము ఋణము లేదా?

గోపీ—ఏమీ! కోటీశ్వరుఁడగు నాకు ఋణమా?

తుకా—ఔను- నీకు, నీవారికి- నీవంశమున యందఱికిని ఋణము లేదా?

గోపీ—నీకు మతి లేదా? 'స్వదీపచుంబనన్యాయ'మున నాకు ఋణమున్న దందువా!—

తుకా—గీ. జనన మందుటే తొలిజన్మఋణముఁ దీర్ప!
మనుట, గురు మాతృ పితృ దేశఋణములందు
నరయ మరణంబు ఋణశేష మనుభవింప;
ఋణము లేకున్న జన్మమే మనకు లేదు!

గోపీ—మూర్ఖా! 'పాటచ్చరయామికన్యాయ'మున యేమి చేసినను చెల్లునని తలఁచితివా? మనది 'వాలకర్కటకన్యాయ'మని యెఱుంగవా?

తుకా——కోపింపకుము! నీఋణాధనము నాపాండురంగని కిచ్చితిని. ఆపాండురంగఁడే నీ కొసఁగఁగలఁడు!

గోపీ——ఆపాండురంగఁ డొకదొంగ- నీ వొకమోసగాఁడవు!

గోపీ——(ప్రత్యక్షమునకు వచ్చి) కాఁడు స్వామీ! మారంగఁ డెన్న టికిని దొంగ కాఁడు! సాక్ష్య మేల? అడుగుఁడు! మారంగఁ డిందే యున్నాఁడుకదా! అడుగుఁడు! (రంగనివిగ్రహమును క్రింద నుంచి) రంగా! నిన్ను నిందించుటమాత్రము విని నే నైఁ పఁజాలనయ్యా! నీవు దొంగవఁట! కాదుకదా! చెప్పుము. ఆతనిధనము గైకొని యేయున్న యిచ్చివేయుము. మోస మొన ర్పరాదు! తప్పుసుమా! అయ్యా! మారంగఁడు దొంగ కాఁడు- అడుగుఁడు!

తుకా——అడుగుఁడు!

గోపీ——అడుగవలయునా? చండాలాధమా! ఏమిచేయుదమా యని 'దధిప్రీహి' న్యాయమున తల్లడిలుచుండ, మాకు 'దగ్ధపదమా ర్జాల'న్యాయమున తీర్పుచెప్పెదవా? నీవును నీరంగఁడును (విగ్రహమును చేత పట్టుకొనును) అఁ- అఁ- అబ్బా! యిది యేమి! అయ్యో! జిజియాబాయిగారూ!

జిజి——గోపీచందుగారూ! ఏమి? మీధనము!——

గోపీ——అబ్బా! నాహస్తము- విగ్రహము- నాప్రాణముల హరించు చున్నది!- బాధ!—

గోపీ——అడుగుఁడు!

తుకా——అడుగుఁడు!

జిజి——ఇదియు మీపనియేనా? ఆగుఁడు! చందుగారూ! నే వదలిం చెద. (విగ్రహమును పట్టుకొని) అఁ- అఁ- యిది యేమి

యద్భుతము! అబ్బ! బాధ! కరము విగ్రహమును వదలి రాకున్నది.

తుకా—హే లీలామానుషవిగ్రహా! యిది నీలీలయా! లేక యైంద్రజాలికమాయామహిమయా!

రోహి—అడుగుడు! అయినదా!

గీ. కలుగ దావంతకలుష మీఘనునియందు;
చాలు, సంతసించితి, కోప మేలనయ్య!
ద్విజులకై వడి నోరుల బాధింపరాదు;
వదలి రావయ్య! నను చేర పాండురంగ!

[జిజియా గోపీచందులహస్తములు విగ్రహమును వదలి బాధావిముక్తము లగును. అంద ఱాశ్చర్యచకితు లగుదురు.]

తుకా—హే తుకారామనామకభక్తశేఖరా! త్యాగమూర్తి యనియు, విశ్వసేవాపరాయణుఁ డనియు గర్వించు నీకు, చక్కని యుపదేశమే లభించినదా! మూర్ఖునకు- శాస్త్రపరిచయగంధమైన నెఱుంగనిజమునకు, దుర్గంధపూరితుఁడగు నీయంటరానివానికున్న దృఢభక్తియందు శతాంశమైన నీకు లేదుకదా! బ్రాహ్మణేంద్రా! 'గురూపదేశ మందితివా?' యని ప్రశ్నించితిరి! గర్వాంధకారమున కన్నుఁగానక గురూపదేశ మనవసర మంటిని! అపచార మొనర్చితి! క్షమింపుఁడు!

గంగా—ఇపుడు బుద్ధిమంతుఁడవు! గురుపూజ యొనర్తువా? మా మాస్వాజీబాబాగారికేనా?

తుకా—కాదు స్వామీ! యిదిగో- (రోహిదాసుచెంతకు పోఁబోవ)

జిజి—(ఆఁపుచు) ఆఁ- ఆఁ! మతి లేదా? చండాలునకు నమస్కారమా!

తుకా—బేలా! భక్తబృందావనమున జాతిమతవివక్షతలకు తావు కలదా? ఆశంకరభగవత్పాదాచార్యుఁడే—

"శ్లో. బ్రహ్మైవాహ మిదం జగచ్చసకలం చిన్మాత్రవిస్తారితం
సర్వం చైత దవిద్యయా, త్రిగుణయా, సేశం మయా కల్పితం
యిద్ధం యస్య దృఢామతిస్సుఖతరే నిత్యే పరే నిర్మలే
చండాలోస్తు సతుద్విజోస్తు గురు రిత్యేషా మనీషా మమ!"

[గోహిదాసుచెంత మోకరించును. గోహిదాసు స్తబ్ధుఁడగును. గంగాధరాదులాశ్చర్యకోపచకితులై చూచుచుందురు.]

యవనిక పడును.



శ్రీరాజరాజేశ్వర్యైనమః—శ్రీసుబ్రహ్మణ్యాయనమః

# భక్త తుకారామ్.



## ద్వితీయాంకము.

### దృశ్యము: ౧

సమయము:—అపరాహ్ణము.

[గోపీచందు గృహసమీప ప్రదేశము. ప్రవేశము: శంభాజి]

శంభా—లోకమున కొందఱు తమకార్యకరణము నెడ నేర్పు ప్రాజ్ఞతను ప్రకటించినను తమకాంతలయెడ మాఱుపలుక నోడుచుందురు. అందును నాకాంత రూపవతియు విద్యావతియు నగునేని, పురుషుఁడు తనవ్యక్తిత్వమును తొలఁగి యాతని పాదదాసుఁ డగు ననుటకు సందియము లేదు! దీనికి కోటీశ్వరుఁడగు గోపీచందే తార్కాణము. అదిగో చంగుగా రింట నున్నారు!

(నిష్క్రమము.)

[యవనిక నెత్త చందుగారిగృహమునందలి యొకగది. గోపీచందు తనవిలాసము నద్దములో చూచుకొనుచు నుపవేశించియుండును.]

[ప్రవేశము: శంభాజి]

శంభా— శేటుగారు!

గోపీ—(ముఖభావమును మార్చుటకు ప్రయత్నించుచు) ఇది ప్రణయ కోపమున గంభీరభావమును సూచించుచున్నది. అందును, కనుల నించుక యరమోడ్చి, క్రేఁగంటిచూడ్కుల, పెదవులదర పరికించిన శృంగారరసము వెల్లివిరియుననుటకు సందియము

లేమ. దీని నేన్యాయ మనవలయు! సుధార్థిహారిద్రాన్యాయ
మా! ఊఁ- అయస్కాంతసూచీన్యాయమా! ఛీఛీ! కాదు-
ప్రణయనీప్రియానురాగన్యాయమా!

శంభా—చందుగారూ!

గోపీ—ఆఁ! శంభాజీ! బాకీమొత్తము నిచ్చుటకా? ఆఁ- అదియు
కాదు- దీని నేమిన్యాయమనిన బాగుండును? దర్వీపాకరసన్యా
యమా! కాదు- కాదు!-

శంభా—ఇదిగో చందుగారూ! మీఋణధనము! ఒక్కయుపకారము-
వడ్డీ యిచ్చుక—

గోపీ—వీలులేదు. వడ్డీ మానుట మాజాతకములో వ్రాయనిపని!
మనదంతయు శార్దూలహారిణన్యాయము! కృపణధనన్యా
యము! పోయి మాగుమాస్తాకు చెల్లింపుము. (ముఖభావ
మును మార్చుచు) ఇది విప్రలంబశృంగారమును సూచిం
చుభావము. ప్రణాపరుద్రీయన్యాయము. వెడలుము- శంభాజీ!
ఆఁ- మాట! నీకు సందేహన్యాయము తెలియునా?

శంభా—(ఆశ్చర్యమున) ఎందుకు?

గోపీ—నమోస్తు: పరదేవతా! మనదేశమున తల్లియే గృహమున కధి
కారిణి! ఔనా? అందును తల్లియే స్వత్వమున కంతయు నధి
కారిణి యైనచో కుమారునివిషయము సంపూర్ణముగ నంగనా
పూర్వన్యాయమే! ఇఁక రెండవకష్టము: విద్యావతియగు
భార్య! వింటివా! శంభాజీ! పద్దులు వ్రాయుటకును, పద్య
ములు వ్రాయుటకును కలయిక తక్కువ. ఈరెండును నొక్క
నికే సంప్రాప్తమైన నేన్యాయమగును?

శంభా—చందుగారూ!

గోపీ—మతిభ్రమణన్యాయమా? లేక, గేహేశూరన్యాయమా?

శంభా—చందుగారూ! విద్యావతియగు భార్యతో విమలసరససల్లాపముల నానందింప శాస్త్రజ్ఞానాభావముకతన విద్వత్కవుల యుపదేశమున, విశేషపరిశ్రమచే కంఠస్థమొనర్చిన యీన్యాయశస్త్రముల నాపై ప్రయోగించిన భరించుశక్తి యుండవలదా? ఇదిగో మీాద్రవ్యము! ఇంచుక వడ్డీ—

గోపీ—మూర్ఖా! పొమ్ము! తెలియదా? మనది భల్లూకముష్టిన్యాయము!

శంభా—చందుగారూ!

గోపీ—లాభము లేదు. వంధ్యాపుత్రన్యాయము-

శంభా—మహాశయా!

గోపీ—మాట్లాడితినా? గగనకుసుమన్యాయము

శంభా—ఆర్యా!-

గోపీ—ఇంకను మాట్లాడిన సందిగ్ధన్యాయము. గతజలసేతుబంధనన్యాయము. పిష్టపేషణన్యాయము. ఆరంభశూరన్యాయము. అప్రసక్తనిషేధన్యాయము. కాకతాళీయన్యాయము. అవ్యాపారవ్యాపారన్యాయము. కంబళభోజనన్యాయము. రండాగర్భన్యాయము!

[శంభాజీ వెడలును. న్యాయముల చదువుచు గోపీచందాతని వెంట వెడలును.]

[ప్రవేశము: జోకాబాయి]

జోకా—(వత్తులబుట్ట ముందిడుకొని—అనుబంధము 6.)

[పునః ప్రవేశము: గోపీచందు]

జోకా—అబ్బాయీ! గోపీ! నే నీకాపురము చేయులేను! ఏమికాపుర మిది నామొహంకాపురం!

గోపీ—అమ్మా! చిన్నతనము. పెద్దదానవు. ఏదో 'మణిసూత్రన్యాయ' మున—

జోకా—అదికాదురా గోపీ! ఆడదాని కింత యూరడియటురా? అబ్బో! రాణీసాహేబాగారికి తెల్లవారింది మొదలు సాయంత్రం దాకా అలంకారముతోనే సరిపోతుంది. దాసమ్మకడుపుచల్లగాను—అదేమలంకారమురా నాయనా! ఇది సంసారి కాని సాని కాదే. అదిగో వస్తోంది. రానీ—యీాదిన మేదోయొకటి తేలితీరాలి—

[ప్రవేశము: నీళ; పుస్తకమును చూచుచు- యోచనతో]

నీళ—గీ. లలితశ్రీరాగకళల కోయిలలు పాడు
మహితగీతార్థమాధురీమహిమ యేమొ?
తనువు మఱపించి, సుప్రేమ జనుల నెల్ల
మోహనమ్మోదజలరాసి ముంప నేల?

గోపీ—నీళ! ఏ మాపుస్తకము?

నీళ—(ఆపి- మగని చూచుచు) నాపేరు నీళాబాయి-

జోకా—ఆఁ- అల్లాగా! చివరకు 'శ్రీమతి' 'గారు' 'రాణీసాహేబా' అనికూడా లేదూ?

గోపీ—నీళా! అది యేమిపుస్తకము? చిత్రామా? ఆవర్జయా? కార్యార్థిన్యాయమున నడుగుచున్నాను.

నీళ—ఇదియా! నేను రచించుచున్న 'శృంగారమోహసుధాంబుధి' యనుగ్రంథరాజము.

జోకా—అమ్మబాబోయి! అంట్లుతోముకొను ఆడాళ్ళకు గ్రంథాలే! కవిత్వాలో అది యేవల్లకాడు అత్వాలో? అమ్మయొయ్యో! యింకేమైన ఉందా?—

నీళ—(మందహాసమున) 'పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా!
యని వేమన నుడివినట్లున్నది. కాని- నాథా! మీరిపుడు పండి
తులు కదా!

గోపీ—ఆఁ- విద్యార్థిన్యాయముః-

నీళ—దీని నేన్యాయమనిన సరిపోవును ?

గోపీ—దీనినా ?- 'గర్దభచందనన్యాయము'; 'దివాంధన్యాయ' మనిన
కూడ సరిపోవును.

నీళ—అందఱికిని యిష్టమైనపవలు గుడ్లగూబకుమాత్ర మయిష్ట మను
నట్లు కదా! ఔను. సంతోషము. కాని వింటురా ? ఇది పద్దు
లు వ్రాయుట కాదు- భవ్యతరగంగాలహరినిబోలు యనర్గళకవి
తాధార- విందురా ?

గోపీ—వింటును- కాని- 'బధిరశంఖాన్యాయ' ముననా ?

నీళ—వినుఁడు.

శా. రంగోజ్జృంభదనంగరాజ్యకలితారంభుల్, సురంభోరు, లా
పాంగాకల్పితభక్తిచే విభుల తా భావించి సేవింతు రా
శృంగారాంచితసుందరీత్వరమ నా స్త్రీక్యంబుచే స్వీయహృ
ద్రంగంబందున పూజసేతు రువిదల్ దైవంబుగా భర్తలన్ !

జోకా—పొయ్యాయిరాబాబు!- మన్నుగొట్టుకపొయ్యాయి మనవంశ
మర్యాదలన్నీ—

గోపీ—ఆఁ- 'కరికపిత్థన్యాయమునసే'—

జోకా—దీనిమూలాన్ని-

నీళ—అదిగో! 'దాన్ని—దీన్ని' అని యనవలదని నే నెన్నిమాఱులు
చెప్పలేదు ? నేను పశువును కాను; పక్షిని కాను—కవయి
త్రిని- జమీందారుపుత్రికను.

జోకా—అదేరాబాబూ! మాకొంప ముంచేది. జమీందారుఁయింటి

పిల్ల వద్దురాబాబూ అని మొత్తుకుంటే విన్నావ్రా? "వియ్యము నకు, కయ్యమునకు, నెయ్యమునకు సమత వలయు" నని యూరక వెఱ్ఱివెంగళప్పై వ్రాశాడా! ఏజమీందారుపుత్రికతోనో చీవాట్లుతిని మఱీ వ్రాసుంటాడు, (నీళ సుఖాసనమున నుపవేశింప) ఆఁ- ఆఁ!- మగనియెదుట కూర్చోటమే!- గోపీ!- మాట్లాడవేం?- అడుగు- ఊఁ-

గోపీ—అమ్మా! అడిగెదను. యిదిగో- హామ్! (గొంతుక సవరించుకొనుచు) నీళా! ఆఁ- ఆఁ- నీవు- ఆఁ- ఆఁ- అట్లు-

జోకా—(గోపిని అనుకరించుచు) ఆఁ- ఆఁ- నీళా!- నీవు- ఆఁ- ఆఁ- అట్లు-

గోపీ—అతిపరిచయాదవజ్ఞత యనున "ట్లతిపరిచయన్యాయ" మున గర్వించి, "యుణకులాచలన్యాయ" మున యంతర మెఱుంగక, "అంధగోలాంగూలన్యాయ" మున—

జోకా—నీ మొహాంన్యాయమున- చచ్చు పెద్దమ్మ! ఈ వెధవన్యాయా లెక్కడ దాపరించాయిరా నీకు?- ఏదీ! చక్కఁగ నిలుము. (గోపీచం దట్లొనర్ప) నేచెప్పినట్లు చెప్పుము. నీళా!

గోపీ—నీళా!

జోకా—నీకు మర్యాద తెలియునా?

గోపీ—నీకు మర్యాద తెలియునా?

జోకా—నీకు బుద్ధి లేదా—

గోపీ—నీకు బుద్ధి లేదా—

[ప్రవేశము: రామేశ్వరభట్టు]

జోకా—నాకు కాదు నీకు.

గోపీ—(దాని నేయనును)

జోకా—ఛీ !- నోరు మూయుము.

రామే—అపూర్వపాత్రక్రమము ! నీళాబాయిగారు ! గ్రంథము సంపూర్ణమైనదా ? ఏదీ ? ఒక్కపద్యరత్నము—

నీళ—(గ్రంథమునుండి చదువును.)

మ. "లసదుద్దీపనతావలం బనఘనోల్లాసంబుమై, మన్మథా
నిశపక్వాంచితమై, విలాసవికసచ్ఛృంగారుభృంగారుస
ద్రసభూయిష్ఠమునై, మనోజసుఖమోదానందసామ్రాజ్య మీ
వసుధన్ గూర్చినభర్తృభక్తి యదియే బ్రహ్మైకసాయుజ్యమా !"

రామే—భళి ! భళి ! అమృతోపమానమైన కవిత ! ఆహా ! మిముఁబోలువిదుషీమణిని, సాధ్వీలలామను, కవయిత్రిని, సౌందర్యవతిని గాంచుటచే భరతమాతయే ధన్య యయ్యె !

జోకా—బాబూ ! నాకోడలిసౌందర్యము, సాధ్వీత్వముయొక్క ప్రసంగము నీకెందుకు నాయనా ? నీవేమి ఆర్చేవాఁడా ? తీర్చేవాఁడా ?

రామే—ఆగ్రహింపకుఁడు. ఈమహిళారత్నమును నే నెఱుంగుదును.

గోపీ—ఆఁ- స్థాలీపులాకన్యాయముననా !- కార్యకారణన్యాయమువనా ?—అదియే ప్రశ్న ?

రామే—ఆయమసౌజన్యము—విశ్వప్రేమ-

జోకా—చాలు బాబూ ! చాలు. ఊరియాఁడవాండ్ర సౌశీల్యము సౌందర్యము బట్టువలె పొగడుటయేనా నీయుద్యోగం ? అందఱిసంసారపుగొడవలు నీకేకావాలి? నీయింటనీకాడాళ్ళులేరూ !-

నీళ—ఏమిమర్యాదయిది ?—

రామే—అననిందు నీళాబాయిగారు ! నాకు కోపముకలుగదు. శాంతమే నాకు లేకున్న యుద్ధవాంశసంభూతుఁడని జనులెల్ల పొగడుచున్న తుకారాం శేటుచెంత దివానుగనుందునా ? జగద్గురుమా

స్వామీజీబాబాగారి యనుగ్రహపాత్రుఁడనై 'రాజమాన్య, సనాతన ధర్మప్రతిష్ఠాపనాచార్య' బిరుదాంచితుఁడనై, లోకోద్ధరణమే దీక్షగా హైందవమతోద్ధరణమహాకార్యభారమును వహింతు నా? జోకాభాయిగారూ! మీ యవకార్యములకు నాకు నవ్వు వచ్చుచున్నది.

జోకా—ఆఁ. ఏడ్పు కాదూ?

రామే—ఏడ్పుకూడాదు. ఏమందురా? మనదేశమున స్త్రీలందఱును మొన్నటిదాఁకా నాగరకతలేని పూర్వకాలమున నేర్పఱుపఁబడిన యాచారములఁ బట్టుకొని దేవులాడుచున్నారు! సాక్షాత్ వసిష్ఠులవా రేమన్నారు? "ఇమే ధర్మాః మయా ప్రోక్తాః దేశకాలపాత్రా విరోధేనయా". జోకాభాయిగారూ! ఆఁడువా రన నేమనుకొంటిరి?—

గోపీ—పురుషులకు భార్యలని—బీజాంకురన్యాయము—

రామే—వినోదము లేక, విహార మరయక, విద్య నెఱుంగని పురుషుల సేవకై నిర్మింపఁబడిన బానిసలని తలంచితిరా?

జోకా—కాదు బాబూ! అలంకారం చేసుకోని, పనిపాటలు మాని, ప్రణయగీతాలు చదువు పసిఁడిబొమ్మలు—

నీళ—కారు- వారు మృగములు కారు- పశువులు కారు- వారు గృహలక్ష్ములు!- అర్ధాంగినులు- సహధర్మచారిణులు- స్వార్థత్యాగశీలలు- వారిహృదయములు మిక్కిలి కోమలములు- మనోజ్ఞములు! పుత్రపుత్రికలకు విద్యాసద్గుణముల బోధించి, శౌర్యసాహసాదులఁ గఱపి, దేశమాతపాదారవిందములకు, శౌర్యధైర్యసాహసవిద్యానిపుణులగు పుత్రుల, ధీరచారిత్రలగు పుత్రికల నర్పించి, దేశమును, సంఘమును నుద్ధరించువారు—

రామే—ఆఁడువారే—

నీళ—పరమేశ్వరు సృష్టిసౌందర్యచాతురిని చాటుచు, ప్రేమ, పరోప కారత్యాగముల కాచారిణులై, సంపూర్ణవికాసమున నలరారు దివ్యతరకుసుమరాజములఁ బోలె, ధరించువారికిని, చూపఱకును, మనోహరసౌశీల్యసద్గుణసౌరభమకరందబిందుసంసేచనమున నానంద మొసంగువారు—

రామే—ఆఁడువారే—

జోకా—అమ్మతల్లీ! గ్రుక్కతిరుగకుండ యెంతయుపన్యాసము చదివితివే!—

రామే—అదియే యాదర్శము. మానవతీమణీ! అదియే యీరామేశ్వరభట్టు జీవితరహస్యము. అదియే—

జోకా—చాల గొప్పవారు స్వామీ! తెలియక నుంగుతాను. కోపము వలదు. శాంతమున మీరా శ్రీరాముని చంపిపుట్టితిరి కదా! అయితే, స్వామీ! కాన్పించినకాంతలవెంబడినెల్ల కాలుసేతులరిగేలా తిరగటం మతోద్ధారానికే? అత్తమామల ధిక్కరించి, మగనిముఖమునకు మసిబూసి పరమానిసివెంట తిరగటం మతోద్ధారానికే? చాలు బాబూ! మీకొక నమస్కారము—మీ మతోద్ధారాని కొకనమస్కారం—

గోపీ—అదీమాట. ఇంకొక పదినమస్కారముల నిమ్ము- నష్ట మేమున్నది? శుష్కోపచారన్యాయము.

జోకా—మీమతోద్ధారధర్మదీక్ష మాకక్కఱలేదు—మీధర్మమూ మాకక్కఱలేదు—దానికొఱకు మీరు మాయింటికి రావటం అక్కఱలేదు.

నీళ—చూచితే ద్విజచంద్రమా! ఈమార్ఖ్యమునకు మేఱయున్నదా? 'విద్వానేవ విజానాతి విద్వజ్జనపరిశ్రమం'—

గోపీ—'నహి వంధ్యా విజానాతి గుర్వీం ప్రసవవేదనాం'—

నీళ—అందును గొప్పవారింటియాఁడుపడుచునగు నా కెంతయవమతి ?-

జోకా— వెధవగొప్పతనము మండిపోను—ఇదెక్కడి గొప్పతనమే ? మగఁడు లేఁడు, మర్యాద లేదు—మంచిలేదు, చెడ్డలేదు—నీయిష్టంవచ్చినట్లు చేయటం గొప్పతనమా ? రమ్మను నీతల్లితం డ్రుల్ని ! ఇదేనా గొప్పయింటియాఁడుపడుచు లక్షణమని సాగ తీసి అడుగుతా ! నీతల్లి యిలా చేసిందా ? నీ అప్పచెల్లెండ్లు—

నీళ—అక్కటకటా ! నేను చాలక నాతల్లిదండ్రులుసైతము నిందకు పాత్రులగుచున్నారే !- రండు- పంతుగారూ !—

గోపీ—నీళా ! ఎక్కడికి ?

నీళ—నిరంతరకవితారణ్యసంచారసంజనితమనోఖేద మపనయింప యుద్యానవనవిహారమునకు—

జోకా—అమ్మో ! అమ్మయ్యో ! విహారమే ? ఒరేయి మొగ్గుపీనుఁగా ! పలుకవేరా ? అనాదిగ వచ్చు యాచారములన్ని మట్టిలో కలిపి, యలంకారము చేసుకొని యూరివీధుల యాఁడుది కన్నవారితో యూరేగుచుండ, మగఁడు ముసుఁగువేసుకొని మూల కూర్చోవలసిందే ! ఊఁ- అడగవేం ?

గోపీ—అమ్మా ! యిదిగో అడిగెద ! యిరువదిన్యాయములతో నడిగెద !

నీళ—రండు పంతుగారూ !

జోకా—ఓసీ ! గడప దాఁటితివా మళ్లా నాగుమ్మం తొక్కటానికి వీలులేదు.

నీళ—ఔనా ! నిక్కమా ! యింట యీయము యాజ్ఞయేనా ?

జోకా—కాక నీదా ? ఆస్తి అంతా నాది—

గోపీ—నీళా ! అత్త యాజ్ఞాపించఁదగినస్థానమున నున్నది. ఏదో మనము 'ఘటీమాత్రవ్యాఘాతమున'—

జోకా——మాట్లాడకుము వెఱ్ఱిపీనుఁగా! (నీళతో) అధిక ప్రసంగములు మాని కుక్కినపేనులా పడియుంటివా సరి——

నీళ——ఔనా! నేను మఱల రాకూడదా?

గోపీ——చూడు- నీళా! నాస్థితి 'తులాదండన్యాయము'. విధిలేక 'విప్రతిషేధన్యాయము'న——

నీళ——నేను మీయర్ధాంగిని కానా?

గోపీ——ఔను- 'చంద్రచంద్రికాన్యాయము?

జోకా——తల్లియే పరదేవత కాదా గోపీ?

గోపీ——నిక్కము. నిక్కము. వేదప్రమాణన్యాయము!

నీళ——నామాట పాటింపరా?

గోపీ——తప్పక- అడుగవలయునా? కరతలామలకన్యాయము కాదా?

జోకా——తల్లియాజ్ఞ గోపీ!——

గోపీ——చెప్పవలయునా? అది సంపూర్ణముగ పరిశేషన్యాయమే!

నీళ——అయిన మీప్రేయసి?——

గోపీ——ఔను- ఔను- నీరక్షీరన్యాయము.

జోకా——అన్నిటికిని ఔనేమి నీతల? రమ్మిచ్చటికి——

నీళ——(పోవుచు) పోవుదునా?

గోపీ——(వలదని సంజ్ఞ చేయు)

జోకా——పడియుండు మూరక- పొమ్మ్మ! రా గోపీ!- (లోని కేగుచు)

గోపీ——'నమాతుః పరదేవతా'! అని తల్లి యిటు! 'భార్యా సమో నాస్తి శరీరపోషణం' అని భార్య యిటు——యిపు డేమన్నను 'భస్త్రికా లవిత్రన్యాయము'! కావున కర్తవ్య మిపుడు 'భిత్తిబిడాలన్యాయమా'? లేక- అమ్మా! యిది యేమిన్యాయము?

జోకా——నీమొహాన్యాయం, చచ్చుపెద్దమ్మా! రా! ఓసీ- పోవేం!-

నీళ—ఆఁ- ఆఁ- అబలలనిన యింత యేారడియా ?

(అనుబంధము 7.) (నిష్క్రమణము.)

యవనిక పడును.

---

## దృశ్యము: ౨.

సమయము: సూర్యాస్తమయము.

[దేహాన్ని గాజోపాంతవనము: పచ్చికపై పరుండి, రెండుచేతులపై శిరముంచి-యెదుట నేలపైనున్న పాండురంగవిగ్రహము నొక్కమాఱును, యస్తంగతుఁడగు భానుని యొక్కమాఱును పరికించుచు గోహిదాసు.]

గోహి—సీ. క్రమముఁ దప్పక యింట ప్రతిదినంబును భానుఁ
డుదయాస్తమయముల నొందఁ నేల ?
గగనంబునకు కాంతి కైసేయుతారకల్
పవలుమాత్రము దాఁగుభంగి యేల ?
క్షణమైన విశ్రాంతి గనక తా పవనుండు
జీవకోటిని బ్రోవ వీవ నేల ?
అనిశంబు కలకలధ్వనుల నవ్వుచు నదీ
సలిలముల్ ప్రవహించుచుండ నేల ?
గీ. ప్రకృతిలో నెందుఁ జూచిన ప్రాణులందు
ధనవిభవమతజాతిభేదంబు లేదు ?
ఎవనియాజ్ఞానుబద్ధమో ? యెవఁడు ప్రభువో ?
హేతు వున్నదో ? సృష్టి నిర్హేతుకంబొ ?

కడుపార భుజించితివా ? రంగా ! ఆఁకలి లేదుకదా ! సిగ్గు వలదు; తినుము ! ఎంతదొంగవు నాయనా ! ఇంతవఱకును పెట్టనివె లుఁగై, బంగరుకిరణములచే నీకు నూతనకాంతి నొసంగిన యాసూర్యుని నీవే సృజించితివఁట ! కాని, యాఁకలియున్నదని

వచింపఁజాలన్రగా? నేఁడుదయమున పాప మూతఁను ధనవు
డుగ పట్టువదలక బాధించితివి. మఱల నేను వారు నిన్నే
మైన శిక్షింపఁగోరితిమా యని పిలిచినంతనే ఏమియు తెలియని
వానివోలె నా చెంతకు వచ్చితివి — ఎవ రావచ్చునది? రమ్మ!
రంగా! వారికంటఁ బడితివా! నీకును నాకును దేహశుద్ధి తప్ప
ను. అది నీతప్పే—వెఱ్ఱివాఁడా! అంటరానివారి నేల సృజించితివి?

[మఱుఁగున దాఁగును. ప్రవేశము: నీళ, రామేశ్వరభట్టు.]

రామే—నీళాబాయిగారూ! మీ కీతుకారాం శేటుభజనలయందు భక్తి
యుదయింప నేమి కారణము?

నీళ—అతఁడును కవియగుటయే- మఱచితి- భజనకై నేను కుసుమ
ముల సేకరింపవలసియున్నది—

రామే—కానిమ్ము! నీళాబాయి! నాకును పనియున్నది. (పోవుచు-
జనాంతికముగ) నీళా! నీ వాతుకారాముని ప్రేమించి రామేశ్వ
రభట్టు నింతచులకనఁ జేతువా? నే నిందే యుండి పరికించెద.
(మఱుఁగున దాఁగును.)

నీళ—'నీళాబాయిగారూ!' యని సంబోధించి, ధూర్తభవించిన ధర్మ
మూర్తియో యన నలరారు నీరామేశ్వరభట్టు 'నీళాబాయి!'
యని సంబోధించె! పతిగృహమును వీడినంతనే నురియాదయు
సతులను వీడి చనునా? అదే—

సీ. మధుకరద్విజులు పద్మగృహాళి నిదురింప
నెంచి తల్పులు మూయు కుంచెకోల;
సురపాళి వినువీధి కరముల దాల్చు బల్
సరసంపు నమృతంపు చల్దిముద్ద;
చిరకాలపర్యటదధ్వరచకోరార్థుల
కాతిథేయ మొసంగు నన్నదాత;

సురకామకాళికి కొంగుబంగారంబు
కుముదినీసతి కోరుకోర్కె విభుఁడు;
గీ. కుందు జారచోరుల కెందు గుండె దిగులు,
తలిరుపానుల గిలిగింత, చలువ కేవి,
పొగరుపాలంతిపచ్చనిపాలి పొరకచుక్క,
చుక్కగమిసామిఁ దోఁచె బ్రాగ్దిక్కునందు!
(చూడ—అనుబంధము 8 లోని చరణము.)

అదే! తుకారామ్ వచ్చుచున్నాఁడు!

[ప్రవేశము: తుకారామ్—పాడుచు]

(అనుబంధము 8.)

నీళ—(తల వంచి) భళి- భళి! ఏమి మాధుర్యము! గీర్వాణభాషయం దింతకన్న మధురతరశబ్దమే లేదు. భళి!- 'మనోహరా!'

తుకా—(ఆశ్చర్యపడి) ఏమంటివి కలవాణీ?

నీళ—'మనోహరా!' యంటిని. తప్పేమున్నది? సర్వజనానందకరము లగు నీయక్షరములు నీచెవులకుమాత్రము కఠోరములుగ నున్నవా?

తుకా—అదికాదు కలవాణీ!

నీళ—అబ్బ! 'కలవాణీ!' యని నీవే యంటివి! కలవాణులతో వాదించి జయింపఁగలవా? 'మనోహరా!'

తుకా—మఱల నదియేనా?

నీళ—'తుకారామ్' యనునక్షరములకన్న నివి బాగుగలేవా! వీనిని చూడుము. ఉపవేశింపుము. తొందఱ యేల? చూచితివా యీకుసుమములను! నిలిచితి వేల? నా కానందమును గూర్పక పోఁగలవా? నాచేఁ జిక్కితివి. లోకమున నీకుసుమము లను నినుఁబోలుకన్నులు కోమలులకు పోల్తురు!

తుకా—ఔను. పరమేశ్వరు సృష్టిచాతుర్యమునంతయు వారిరువురి యందే చూడఁగును.

నీళ—సూక్ష్మగ్రా... ఈకుసుమముల మనోహరసౌరభమును గాంచితే? ఇవియు దైవముచే సృజింపఁబడినవే! ఔనా?

తుకా—ఆఁ- నిక్కమే'

నీళ—సమంజసము. వీని నెవ్వరు ధరించినను, మొదలు ధరించినను, వీనిసౌరభమనోహరతలకు కుంటు కల్గునా?

తుకా—కలుగదు—

నీళ—ప్రేమసూత్ర మొక్కటి యుండవలయుఁగాక! కోములులును—

తుకా—ఆఁ- ఆఁ- కామినీ! నీయర్థము?—

నీళ—చక్కఁగ లేదా? అయిన నది నావొసమే!- కాని- ఆఁ- అందు చూడుము? ఆకోయిలదంపతుల! అవియు దైవముచే సృజింపఁబడినవే.

తుకా—సందియ మేల?

నీళ—ఔనా? అయిన నోకవిశిరోమణీ! వాని కాపాండురంగసాన్నిధ్యము కలదా?

తుకా—ఏల కలుగదు?

నీళ—అయిన వానికి వైరాగ్యము లేదే—భక్తి శూన్యమే—భజనలు కాన్పింపవే?—సమయాసమయములు లేక, వావివరుసలైన గణింపక, యనురాగమే ప్రధానముగ నెంచి, లోకమునే శృంగారమయముగ నొనర్చుచున్నవే? వానికి వివాహ మెవ్వరు చేసిరి? వేదమంత్రముల పఠించి యెవ్వరు ముడివైచిరి?

తుకా—తరుణీమణీ!

నీళ—నాపేరు నీళ! నాతలిదండ్రులును, నన్ను ప్రేమించువారందఱును నీళ యనియే పిలుచుచుందురు.

తుకా—అయిన- ?

నీళ—నాపై నీకు ద్వేషము కలదా ?

తుకా—లేదు ప్రేమయే కలదు !

నీళ—అయిన నాయానందమున నీకేమైన నష్టమున్నదా లేక నీవార్జించిన పుణ్యమంతయు నశించునా ?

తుకా—నీ కానందమే కలుఁగునెడ 'నీళా !' యని—

నీళ—ఆఁగుము—నీవు భక్తుఁడవు కావా ?

తుకా—(ఆశ్చర్యమున) ఏల ?

నీళ—నా కిటీవల భక్తి యుదయించినది—ఆఁ- చాలభక్తి. నీవు భక్తుఁడవు- నేను భక్తురాలిని; నీవు గురువు- నేను శిష్యురాలిని; నీవు కవి- నేను కవయిత్రిని —పూజింపనిమ్ము. (చెంత మోకరిల్లి- కర మిడి) అబ్బ ! సంశయ మేల ? మనయిరువురికిని భేదము కలదా ? నాగురుపూజావిధానము వేఱు. మనోహరా ! ఱిచ్చ వడియెదవేల ? భేదము లేదని నేను తొలుతనే వచింపలేదా ?

[పుష్పముల నలంకరించును- అనుబంధము 9.]

పూజ సైనది. గురూత్తమా ! యిఁక గురుదక్షిణ- యిదే శిష్యురాలు, తన అధరామృతముతో, సౌశీల్యధన మర్పించుచున్నది. (ఆలింగన మొనర్పఁబోవ)

తుకా—(త్రోసి) తొలఁగు మావల ! కామినీ ! యిదియా నీగురుభక్తి ?

నీళ—అయ్యో ! విరసహృదయ ! ఏంతగ త్రోసితివి అకటా ! నవనవోన్మేషకుసుమరామణీయకమును భ్రమరంబుబోలె, పాటలాధరాధరసుధారసమును గ్రోలి, మన్మథకళాపాండితి వెలయించి, కందర్పసామ్రాజ్యము నేలుమన్న వలదని నిరసించుపంద లుందురా ?

తుకా—అయ్యో! కామినీ! ఎట్టి దురితమునకు మనమున తావొసంగితివి? నీవు భారతీయాంగనవు కావా?

సీ. వరత్రిమూర్తులనైన పసిపాపలుగ చేసి
తనరారు నసనూయ ధనమదేది
కామాంధుడై, తన్నుఁ గవయఁగోరెడి వ్యాధు
దహియించు దమయంతి ధనమదేది
అగ్నిగుండముఁజొచ్చి యలయక దరహాస
మున పొల్చుజానకి ధనమదేది
ధవునకై పరులిండ్ల దాసియై ముద మొందు
ధరణి చంద్రమతి సద్ధనమదేది?

గీ. ధవుని బ్రదికించు సావిత్రి ధనమదేది?
ధరణియఖిలార్థసాధక ధనమదేది?
తరుణి! యట్టి పాతివ్రత్య ధనము వీడి
పశుసుఖంబును కాంక్షింప భావ్యమగునె?

నీళ—నిక్కువము. వారందఱును పుణ్యచరితలె! అనుకూలదాంపత్యమున, ప్రేమస్వరూపులగు పతుల సాంగత్యము కలిమిని వారెంతయు వాసికెక్కిరి నీవుమాత్ర మంగీకరించితివా మనమును నట్టే—

తుకా—హరీ! హరి! కామినీ! దైవస్వరూపుఁడగు పతియెడ ద్రోహమా?

నీళ—ఆగుము. దాంపత్యమునకు ప్రేమ ముఖ్యముకాదా! వెట్టివాఁడా? ప్రేమ బలవంతమున జనించునా? నేనజ్ఞానావస్థనున్న తఱిని, యెవ్వఁడో యొకఁడు- అపరిచితుఁడు- బ్రాహ్మణులెవో కఠోరస్వరమున మంత్రములు చదువుచుండ- నాగళమున

సూత్ర మొక్కటి కట్టినమాత్రమున- యావజ్జీవము నాకు దైవ
మగునా ?

సీ. భారతసతులకే పతిదైవభక్తి నే
దేవుండు నొసట విధించెనయ్య ?
కఠినుండై తనయ నీగతి దాన మొనరింప
తండ్రి కర్హత యెట్లు తనరెనయ్య ?
అర్థంబు నరయక యతిబాల్యమున సేయు
పరిణయం బది యెట్టిబంధ మయ్య ?
ధవున కెందఱుసతుల్ తనరిన కలుగని
కలుషంబు సతి కెట్లు కలుగునయ్య !
గీ. జగతి నానంద మొక్కరి స్వత్వమయ్య ?
అవని సౌఖ్యమే సృష్టిరహస్య మయ్య !
గ్రంథమున కాక, కలుషంబు కలదటయ్య !
వలచి వచ్చినసతిఁ ద్రోయు పాడియయ్య !

కా—మానినీ ! మానసమువహించిన ట్లంతయు గర్వమదక్రోధపిశాచావేశితవై కన్నుఁగానక, భవ్యతర భారతీయపరిణయవిధులనే దూషింపసాగితివా !

సీ. స్త్రీపురుషుల మహాసిద్ధియే పరిణయం
బను టార్యఘోషము చరయుమమ్మ !
ప్రణయమే పరిణయపరమార్థ మగునేని
మృగమానవవిభేద మేలనమ్మ !
బధిరైన, పతి రోగబాధితుం డైనను
కలకాల మీప్రేమ నిలుచునమ్మ !
ధర్మార్థములనెల్ల ధవున కర్థాంగివై
తనరుటే వేదార్థతత్త్వ మమ్మ !

గీ. కామ్యతుచ్ఛేంద్రియాసక్తి క్షణికమమ్మ!
లలన! ప్రేమ యెంచున స్వార్థరహితమమ్మ!
ధవుని దైవముగా నాత్మఁ దలఁపుమమ్మ!
శాశ్వతానంద మదియె యొసంగునమ్మ!

నీళ—ఆఁగుము. నీ వాహరిభక్తుఁడవు కావా! ఆశ్రీహరిప్రేమఁ బడయఁగోరెదవా?

తుకా—త్రికరణపూర్వకముగ- ఏల?

నీళ—లోకమున తండ్రిప్రేమఁ బడయవలయునన్న తొలుత కుమారుల ప్రేమఁ బడయవలయు. ఔనా! కావున- తొలుత మాకుమారునిపూజ- పిదప మాధవునిపూజ—

తుకా—హరి! హరి!- కామినీ! క్షణికసౌఖ్యమునకై ముక్తిసాధము నే, నేలపాలొనర్తువా?

నీళ—ముక్తియా? వెఱ్ఱివాఁడా?—

గీ. ముక్తిసౌధంబునకు రక్తి మొదటిమెట్టు;
హరికటాక్షమందు; మనోహరికటాక్ష
మిందు; ఫలమందు యిందు నానందమొకటె!
రక్తి ననుభవించినగాని ముక్తి కలదె?.

తుకా—చక్కని యుపన్యాసవైఖరి! అసదృశకార్యకరణధౌరేయతాసూచకమేధాశక్తి! అయినదా! ఓ లోకోత్తరసమ్మోహనదేవతా! నినుగాంచి, భారతదేశమున నబలలు విద్యావతులగుటకు సంతసింతునా? విద్యావతులగుటచే, సనాతనాచారములమంటఁగలపి, మను పరాశరాదిస్మృతుల పీటఁబుచ్చి స్వైరిణులై వ్యభిచారిణులగుటకు దుఃఖింతునా?

నీళ—అబ్బ! ఎంతమాటాడితివి. కాని, స్మృతులంటివి. లోకమున స్త్రీపురుషుల ప్రేమ నామోదింపని స్మృతులున్నవా?

తుకా—ఏమి? మను పరాశరాదిస్మృతులా?

నీళ—చూచుము. నాకు- మనోజరసలాలితమైన మానసికమోహమే- మనుస్మృతి! ఇంక నీకు- సుమశరబాధా ప్రతప్తనయనుండవై పరావిద్ధుండవగుటయే- పరాశరస్మృతి! త్వదధీనానవశిష్టమైన న్యనగుటయే వశిష్టస్మృతి. మన యిరువురికిని, యనంగకిస్మి మర్మశృంగారవిజ్ఞానేశ్వరులౌటయే విజ్ఞానేశ్వరస్మృతి!

(సమీపింప)

తుకా—నిలుము దూరమున, సరసవాణీ! నేడు నీవు విరసవాణివై, భవదీయ శృంగారచాతుర్యముల ప్రకటించి, నీవు దిగనున్న నర కకూపమున నన్నుసైతము దింపంజూచెదవా?

నీళ—అయిన- నన్ను ప్రేమించితినంటివే!

తుకా—నేనా?—

నీళ—ఆం- నీవే—

తుకా—ఆం- ఔను. ప్రేమించితి- అయిన కుమారిగకాని, సుకుమారి గకాను. బేలా! ప్రేమ పరమపవిత్రము. భవ్యతరగంగాలహా రింబోలె యనర్గళము. దానియందు పశుపక్షిక్రిములకుసైతము సహజముగు తుచ్ఛేంద్రియసంతృప్తిలేదు. నీచతరకామ్యేచ్ఛలేదు. అంగీకరించితి మగువా! నీ నిర్మలప్రేమను. నీమగనినే నారూ పముగ ధ్యానింపుము, నీ కా సర్వేశ్వరుండు సద్బుద్ధినొసంగుం గాక.—(పోంబోవ)

నీళ—ఆం- బాధ- (పోవుచున్న తుకారామ్ ఆంగి నీళవైపు చూచు చుండ) బాధ- (శిరమును పట్టుకొని) తల- బ్రద్దలగుచున్నది.

తుకా—ఎక్కడ? ఏమిబాధ- (సమీపించును.)

నీళ—(కనులు మూయుచు- కైతవబాధ నభినయించుచు) ప్రాణము- పోవు- చున్న- ది.

తుకా—(చెంతమోకరించి- ఉపచారము సేయుచు) ఏమిబాధ—

నీళ—హా! (ఆలింగన మొనర్చుకొనఁబోవ)

తుకా—దురితాత్ము రాలా! (త్రోసి) మోసమునకు సైత మియ్యకొం టివా! ప్రకృతవిద్యావిధానమున గాక, జ్ఞానార్థకమగు విద్య యందు దోసముండదనియు, విద్యావతియగుటచే బుద్ధి పెడదారి త్రొక్కనున్నను జ్ఞానగరిమ దాని మఱలింప సమర్థురాలవనియు నెంచి శాంతమువహించినకొలఁదియు కన్నుగానవా! నీమోము మూడఁజాల (పోఁబోవ)

నీళ—పొమ్ము! అవశ్యము పొమ్ము. అనాయాసముగ లభించిన ప్రేమ లతికను చేతులార ఛేదించిన నీయట్టి ఘనుని- భక్తిభూషితుని- దయాదాక్షిణ్యబంధములు మాత్రము బంధించునా! పొమ్ము- నిలచితివేల? సంతోషమున పొమ్ము. ఈసంతోషము దుఃఖ ముగ మాఱిన మాత్ర మీతన్వంగిని దూరకుము. ఈతన్వంగి యిఁక నీపాలి కాలభుజంగినిమైన నది నీదోసమేయని భావిం పుము. నేకోరినది మదీయాధరసుధారసపానము:—నీవుఁ గైకొ వనున్నది మద్వైరహాలాహాలపానము. ఓ భక్తశేఖరా! క్రిమి కీటకాదులు సైతము వైరనిష్కృతి నపేక్షించుచుండ- సకలేం ద్రియపాటవసమర్థయగు- 'నీస్వైరిణి'— తన ప్రత్యవయవము నుండి యుబికి వెలివడనుంకించుచున్న పరితాపాగ్ని ప్రేరిత యగు— 'నీస్వైరిణి'— నీవొనర్చిన మహాపచారమును సైఁచి యూరకుండునని తలంచితివా!

తుకా—(మందహాసమున) సంతోషము సోదరీ! సంతోషమున నంగీ కరింతును. నాప్రాణములహరింతువా? (మోకరించి) కైకొమ్ము! భారతపురంధ్రీమణుల సౌశీల్యమునకై వాని నతిసంతోషముగ నర్పింతును. శైలా! సహస్రాశనులు శిరమునఁ బడినను, సకల

హింసాయంత్రము లొక్కపెట్టున నాప్రత్యేవయువమును తుత్తునుకొనర్చినను, నే ననంతజీవములతో— అనంతమానసములతో— సంతోషమున భరింతును ?—కాని భీతిల్లను !

నీళ—అయిన దేనికై భీతిల్లెదవు ?

తుకా—నీకై - సోదరీ ! నిజపాతివ్రత్యాకున లోకోన్నతకీర్తిని గడించి, మాతృదేశభక్తిప్రబోధితలై వాపోవు పసికూనలనైన సరకుగొనక- సముద్దండదండహతుల ప్రశాంతభావమున సైచు నారీమణుల- సుత, భ్రాతృ, పుత్రుల- భర్తల వైరికృధాగ్నికి చేచేత నర్పించినను, మోమున మందహాసమును మానని ధీరచారిత్రల జన్మచే పవిత్రతనందిన భారతమాతకే నీయొక్కనె కతన యపయశము కల్గునేమోయని భీతిల్లెద !

(అనుబంధము 10.)

[నీళ- పశ్చాత్తాపభరమున నిశ్చేష్టయగును. తుకారామ్- నిష్క్రమించును.]

యవనిక పడును.

---

## దృశ్యము: 3.

సమయము: సూర్యోదయానంతరము 10 ఘడియలు.

[దేహూగ్రామమునందలి యొక బయలు; అలంకృతములైన గోపురులుండును. పౌరులుపవేశించియుందురు. సువాసినులును నుందురు. ఒక వేదికయు, దానిచెంత సమున్నతాసనములు నమర్పబడియుండును. గంగాధర, రామేశ్వరభట్, శంభాజీ, గోపీచంద్ మున్నగువారుందురు.]

గంగా—విషయముల నెఱుంగుదురుకదా ! మహాజనులారా ! హైందవధర్మసంస్థాపనకై శ్రీ శ్రీ ఛత్రపతి శివాజీ మహారాజుగారు దేశ

మునందంతటను గో పూజామహోత్సవమును, ప్రత్యేకముగ నొక్కదినమున జఱుప నియమించినారు. ప్రతాపఘర్ దుర్గమును జయించి, సింహగడమున కేగుచు, మహారాజుగారు నేటి యుత్స వమున కిందేతెంచి, స్వయముగ గోపూజామహోత్సవమును ప్రారంభింతురు. కార్యక్రమము తెలసియేయున్నదికదా! తుకా రామ్! ఏడీ? రాలేదా? రాళశాస్త్రపండితుడు. భక్తిజ్ఞాన ములచే, మహారాజు సహాయము లేక హైందవమతస్థాపనచేయ విశ్వసేవాపరాయణుడు. ఏలవచ్చును? (లోన భేరీధ్వానములు) అదే మహారాజుగారు వచ్చుచున్నారు.

[ప్రవేశము: సైనికపరివేష్టితుడై శివాజీ మహారాజు.]

జయతు హైందవధర్మపునరుద్ధరణ దీక్షాబద్ధకంకణా! విజ యీభవ!

[వేదాశీర్వచనప్రవచనములు: స్త్రీలు మంగళహారతి నొసంగుదురు.]

(అనుబంధము 11.)

గంగా—శ్రీ జగద్గురు మాస్వామీబాబాగారి మార్గదర్శకత్వమున హైందవసామ్రాజ్యసార్వభౌముని గోపూజామహోత్సవమును ప్రారంభింపవేడెద! రాజేంద్రా! ఇవియే పరికరములు।

[ద్విజులు మంత్రములుచ్చరించుచుండ- శివాజీ గోపూజయొనరించును.]

గంగా—భక్తులారా! ఎవ్వని భవ్యతరజన్మచే, పారతంత్ర్యశృంఖలా బద్ధయై, తేజమువాసి, తానురత్నగర్భయైనను, నిజనందనులు కడుపార యొకపూట తినుటకన్నములేక, జీవచ్ఛవంబులై చెలం గుదుస్థితిగాంచి, యశ్రుధారాభిషేచనల విలపించు భారతజననికి వీరసూనామముకలిగెనో? ఎవ్వాడు జననమాదిగ శ్రీరామ భీష్మార్జునాదిలోకైక కర్మవీరులచారిత్రశ్రవణముచే, నిజధీరచా

రిత్రమున, పురాణయుగములయందేగాక కలియుగమునను, దేశ బాంధవమహాత్ములకు తావుకలదని నిరూపించెనో- ఆయాద ర్శకర్మయోగి ఛత్రపతి శివాజీమహారాజు నొక్కపరి జయ జయధ్వానముల కీర్తింపుఁడు.

[అందఱును 'జయ్' ఛత్రపతి శివాజీ మహారాజునకు- జయ్.]

శివా—సోదరులారా! సోదరీమణులారా! మహాత్మ్యదీయప్రయత్న వజ్రసంఘాతమున నామమాత్రావశిష్టమై, చావనున్న హైందవమతధర్మ సస్యమునకు నిజప్రతాపవహ్నిచే బాహుబలమును ప్రకటించి, శాత్రవుల కసిదీరచక్కాడి, తద్రుధిరజలాభిషేకమున నుఱల జీవకళనొసంగి, తనుమానప్రాణసర్వస్వములు ధారవోసియైన, కర్మయోగినై, సుస్థిరమై, సునిశ్చలమై వెలరారునట్లుచేయుటయే యీశివాజీ జీవిత ముఖ్యోద్దేశము. మేమిప్పుఁడే కొలఁది దినములక్రిందట బీజాపూర్ సుల్తానుల పరిపాలనమున నున్న ప్రతాపఘుర్ దుర్గమును సాధించి- అందు- హైందవధర్మప్రతిష్ఠ- గోబ్రాహ్మణ వేదచోదితవర్ణాశ్రమధర్మప్రతిష్ఠల నొనర్చితిమి. అది సుస్థిరముగనుండ మీయాశీర్వచనమును వేఁడుచున్నాము.

గంగా—సార్వభౌమా! విప్రాశీర్వచనము లెప్పుడును భవదీయప్రయత్నవిజయమునే కాంక్షించుచున్నవి. అయిన- ప్రకృతము- త్వదీయధర్మపరిపాలనమున నున్నను వర్ణాశ్రమధర్మముల కించుక భేదముకల్పించుచు, బ్రాహ్మణాధిక్యత నధిక్షేపించుచు- శూద్రుఁడొకఁడు డీగ్రామమున మహాత్ముఁడై ప్రజలకెల్ల వేదరహస్యముల వెదజల్లుచున్నాఁడు. నేను జగద్గురు శ్రీ మాసాజీ బాబా మతాస్థానవిద్వాంసుఁడనగుటచే- యీప్రాంతమున సనాతనధర్మముకు పాలింపవలసిన గురుస్థాన మలంకరించినక

తన- తమకు విన్నవించు బాధ్యత నాశిరమున నుండుటచే- విధిలేక- నీ నిండుసభయందు- యిట్టిసంతోషసమయమున విన్నవించు సాహసమునకు పూనుకొనవలసివచ్చెను.

శివా—ఏమీ- భారతదేశమున- నస్మదీయపరిపాలనమున- వర్ణాశ్రమ ధర్మభంగమునకు తావుకలదా? ఈవిషయమై మాకిదివఱకే విన్నపమేల రాలేదు?

గంగా—క్షమింపుఁడు. అతఁడు భక్తుఁడో యున్మత్తుఁడో తెలియకుండుటయే కారణము. అంతియఁగాక కేవల పశుబలసహాయమున, కర్మయోగమున, కరవాలబలమున సంపాదించిన రాజ్యమెన్నఁటికిని సుస్థిరముకాదని, ప్రజలలో ప్రచారమొనర్చుచుండుటచే, యతని యపరాధస్వరూప మిట్టిదని నిర్ణయింపజాలమి నావచింపమికి కారణము.

శివా—ఏమీ! మాయుద్యమమును సైత మధిక్షేపించుచున్నాఁడా! అయిన నిది నిక్కముగ విమర్శనీయమే కాని- ద్విజేంద్రా! యతనివాదము?—

గంగా—దేవా! పశుబలమున, కర్మయోగముచే సంపాదించిన రాజ్యలక్ష్మి బలవంతమున ప్రజలశిరములపై స్థాపింపఁబడినను, నయ్యది వారి హృదయాగారముల సుస్థిరనివాస మొనర్పవలయునన్న భక్తిజ్ఞానకర్మసమ్మేళన మావశ్యకమని—

శివా—కాదు- భక్తిజ్ఞానములు మోక్షైకసాధనములైన నగుగాక రాజకీయకార్యరంగమున వానికి తావులేదు. రాజ్యస్థాపన- ధర్మప్రతిష్ట- యిట్టి మహత్తరకార్యసాధనకై కర్మబలపరాక్రమములపై నాధారపడవలయు- ఇంతవఱకేల? మొన్న ప్రతాపఘుర్ దుర్గము- మహారాష్ట్రశూరాగ్రేసరుల రక్తాజలాభిషేకమున లభించెగాక- భజనలచె- పురాణపఠనములచే లభించెనా!

బ్రాహ్మణేంద్రా! చలిచీమనైన బాధింపని యహింసాప్రేమ మూర్తులగు బౌద్ధాశోకాదుల ప్రసవించిన భారతజననియే లోకైకకర్మవీరులగు భీష్మార్జునాదుల ప్రసవింపదా? కాదు- ఎన్నటికిని కాదు. వృక్షచ్ఛాయల- పర్ణకుటీరముల నివసించి ప్రపంచమున కాధ్యాత్మికబోధసల్పు భక్తులకు వేదాంతోపనిషదూహాప్రపంచమున కాని కర్మరంగమున తావులేదు. కర్మయోగియై, శాత్రవకళేబరసోపానముల నధిరోహించి శౌర్యపరాక్రమహర్మ్యమున- మహారాష్ట్రదేశజనని రక్తసిక్తాంగముల గొల్చిన కాని, యమ్మాత సుస్థిరయై, సునిశ్చలయై, యానంద మొందఁజాలదు.

[ప్రవేశము: శీఘ్రయానమున—చారుఁడు]

చారు—విజయోస్తు. ప్రభూ! ప్రతాపఘుర్దుర్గము—

శివా—ఓయీ! ఉదంతమేమి? శీఘ్రముగ వచింపుము.

చారు—శాత్రవులు ప్రతాపఘుర్దుర్గమును ముట్టడించిరి. దుర్గము దక్కుట సంశయాస్పదము.

శివా—లక్ష్మోజీ యేమయ్యెను!

చారు—లక్ష్మోజీ వీరస్వర్గమున!

శివా—భవానీ! అంబా! నీలీలపరమాద్భుతము. ప్రభువుకై- దేశస్వాతంత్ర్యమునకై ప్రాణమర్పించిన యావీరవతంసునికా పరమేశ్వరు ప్రసాదభాగ్యముకలుగుగాక! ఓయీ! నీవీక్షణమున పోయి మేము సైన్యముల సమకూర్చుకొని నాల్గుదినములలో నందుచేరఁగలమని జయదేవునితో వచింపుము. మొన్ననే వేల కొలఁది దేశభక్తిపూరితులగు మహారాష్ట్రశూరుల పవిత్రతర రక్తధారలు యథేచ్ఛముగ ప్రవహించెను. ఆత్యాగమున దుర్గము మాయధీనమయ్యెను. కాని- మరల యాదుర్గమునే

శాత్రవులు ముట్టడించిరి- సేనలకై సింహగడమున కేగవల
యునా ?—అయినమిగిలినదెయ్యది ?- శూరశేఖరుల రక్తధా
రాభిషేచనమున నే సాధించిన మహత్తరకార్యమెయ్యది ?—

చారు—దేవా !—

శివా—ఆఁ- నేను గతించిన ? ఇక్లెన్ని పర్యాయము లీ దుర్గమును
సాధింపవలయు? సుస్థిరవిజయమునకు భక్తిజ్ఞానములును యావ
శ్యకములా ? (చొక్కానుండి భగవద్గీతనుదీసి) 'కురుకర్తైవ
తస్మాత్త్వం' 'కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన' లేదు-
కర్మరంగమున భక్తిజ్ఞానములకు తావులేదు- ఆఁ- రఘుదేవ్ !
నీవీక్షణముననే సింహగడమున కేఁగి యందుండి సేనల ప్రతాప
ఘడ్ దుర్గమునకు కొనిరమ్ము. తానాజీతో నాయాజ్ఞవచిం
పుము. పొమ్ము. (చారుఁడు- నిష్క్రమించును )—'కురుకర్తైవ'
కర్మాచరణమేనావిధి- 'మాఫలేషుకదాచన' ! ఫలాసక్తినా
కుదూరము. (మఱల భగవద్గీతను చూచుచు) ఔను-

శ్లో. "మయిసర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా
నిరాశీ ర్నిర్మమోభూత్వా యుద్ధ్యస్వవిగతజ్వరః"

(భగ. అధ్యా: 3 శ్లోకం: 30.)

ఔనా ! ద్విజేంద్రా ! ఆశీర్వదింపుము (మోకరించి) కర్మవి
జయమును !

గంగా—(వేదాశీర్వచనములు) మహిళామతల్లులారా ! విజయకన్యకా
కరగ్రహణకుతూహలాయత్తచిత్తుండగు నీకర్మయోగి 'ఛత్రపతి'
శివాజీమహారాజు నలంకరింపుఁడు.

(స్త్రీలు తిలకమునుంచి- హారతి నొసంగుదురు.)

శివా—అనుగృహీతోస్మి ! భూదేవోత్తములారా ! మహిళామతల్లు
లారా ! భవదీయ పవిత్రతరమంగళాశిషములు నన్ను రక్షించు

చూడ పరికించెద కర్మయోగమునకు నేఁడా ట్లాపరాత్పరుఁడు దుర్భిక్షయోగమును ఘటిల్లఁజేసెడినో ? ఆకర్షించెద రిపుపరాక్రమాకృష్టవిజయకన్యాకాకరకమలమును మామకతను మానప్రాణసర్వస్వమును ధారవోసియైన ! నిలువరించెద నరిసందోహకరవాలధారాసహస్రముల మామకానూనపటుశౌర్యవహ్నిప్రసరణమున ! స్థాపించెద ! హైందవధర్మసామ్రాజ్యలక్ష్మిని ! రిపుసందోహకంఠ కంఠమాలాలంకృతనుచేసి, కర్మయోగవిభూతి మామకబాహుపీఠిని. జయ్ ! భవానీ ! జయ్ !

[అనుబంధము 12. కరవాలముల నెత్తి]

యవనిక దిగజారును.

---

దృశ్యము ౭.

సమయము: మధ్యాహ్నము.

[దేహూగ్రామమునవలి బయలు; ప్రవేశము: గోషీనాను పాండురంగ విగ్రహముతో]

(అనుబంధము. 13.)

శిహి— మొత్తముమీఁద నీవును నేనును నొక్కస్థితియందే యున్నాము. రంగా ! నీకును 'నా' యనువారు లేరు. నాకును 'నా' యనువారు లేరు. ఎవ్వరికిని నినుచేరజాలమిచే, నీవును, చేరరామిచే నేనును, ఋషిపురమును నంటరానివారమే. ఇదియేమి రంగా ! యిచ్చటికి కొని తెచ్చితివి. మఱల యేనాటకమాడఁదలంచితివి ? వలదు నాయనా ! పంచముల కష్టముల నేమహాత్ముఁడు బాపవలయునో ? యిదియేమి రంగా ! పలుకవైతివి ?

(అనుబంధము 14. పాడుచు నిష్క్రమించును.)

యవనిక పడును.

---

శ్రీరాజరాజేశ్వర్యైనమః—శ్రీసుబ్రహ్మణ్యాయనమః

# భక్త తుకారామ్.

## తృతీయాంకము.

### దృశ్యము ౧.

సమయము: ఉదయము.

[శ్రీమూస్వాజీబాబా మఠప్రాంతము; దేవతార్చన- మంగళహారతి- భక్తులుకొంతమంది- శంభాజీ- గంగాధరులుందురు. అందఱికిని తీర్థప్రసాదము లైనపిదప.]

శంభా—స్వామీ! అందఱికిని తీర్థప్రసాదము లైనవా! నేఁడేల తీర్థపుకానికలింత యల్పముగనున్నవి?

గంగా—భక్తబృందము స్వాములవారిసన్నిధికి చనుదెంచినకదా! తీర్థపుకానుకలు వచ్చుట! శంభాజీ! తుకారామ్ వైరాగ్యప్రబోధలు ప్రజలలో ప్రబలుకొలందిని స్వాములవారిచెంతకు శిష్యకోటి యరుదెంచుటయు సన్నగిలుచున్నది.

శంభా—వ్యాపారమునను నంతియెస్వామీ! అడుగనివారిది పాపము- కాని- యతనికి 'ఆంక్షు' పత్రిక పంపిన—

గంగా—కులమునుండి బహిష్కారమా? అది యిదివఱకే యొసంగబడినది. దాని నాతఁడు సఱకుగొనినకదా? యింక సనాతనధర్మప్రతిష్ఠాపనాచార్యుఁడగు శ్రీఛత్రపతి శివాజీమహారాజునకు నివేదించుటమాత్రము మిగిలినది.

[ప్రవేశము: రామేశ్వరభట్టు]

రామే—అభివాదనములు! గురుపాదసరసీరుహములకు—

గంగా—కళ్యాణమస్తు! ఏమయ్యా! నీయప్పు తీఱినదా ?

రామే—చిత్తము. తుకారామ్ శేటుగారి పుణ్యమున—

గంగా—ఏమిపుణ్యమయ్యా ? గోవునుచంపి చెప్పులుదానముచేసినట్లు గోపీచందను శాకీ నివ్వక నీకిచ్చుట పుణ్యమా !

రామే—చిత్తము. అదే నేనును యోచించుచున్నాను. అప్పుతీఱినదన్న మాటయేగాని, యాతని దివానుగానున్నప్పటినుండి యతని భార్య జిజియాబాయిచే, దినమున కోకకోటి మంగళాష్టకములు కలుగుచునేయున్నవి.

గంగా—వింటివా ! శంభాజీ ! శూద్రస్త్రీ బ్రాహ్మణుల నిందించుటయా ! బ్రాహ్మణజాతి కెంతయవమానము !

రామే—భాగ్యము. దానికి తగినప్రాయశ్చిత్త మొనర్చుటకై యే నేనా తని యుద్యోగము నంగీకరించితిని. చీడపురుగువోలె చెట్టునంటియే చెట్టును నాశన మొనర్పవలయుకదా ?

శంభా.—భళి ! అది కార్యలక్షణము.

గంగా—ఏమయ్యా ! తుకారామ్ స్వాములవారి దాసుండై సమాశ్రయణమందినట్లు చేసితివా ! రాజమాన్యసనాతనధర్మప్రతిష్ఠాపనాచార్యబిరుదములును, మతవిద్వాంసపదవియు లభింపగలవు. ఏమందువు ?

రామే—వెట్టివాఁడా ! 'సిరిరా మోకాలడ్డువారుం' దురా ?

(లోన - అనుబంధము 15 లోనిచరణము.)

శంభా—అదే- తుకాగా మీ్వానె పునకే వచ్చుచున్నాఁడు.

రామే.—శంభాజీ ! అయ్యదియేకదా నీపాలము. నీ వెళ్లైన తుకారాము నాపాలమునకు కాపరిగ నియోగింపుము.

శంభా—నియోగించిన ?—

గంగా—అంతమాత్రము తెలియవా! నేనంతయు వచింతును రమ్ము.

[వెడలుదురు. ప్రవేశము: తుకారామ్
యవనిక నెత్త శంభాజీ పొలము కాన్పించును.]

(అనుబంధము 15.)

తుకా—నిర్జనప్రకృతికిని సాధకుని మానసమునకును గల సంబంధమతి మధురము- అనిర్వచనీయము- అనుభవైకవేద్యము- ఔరా! సంసారభారమును భరింపఁజాలక నీవనమున కేతెంచితిని- యిచ్చటనూ- విశ్వసంసారభారము- భళి- మాయ- ఇదియే కవనమునకు సమయము—

[ఉపవేశించి వ్రాయుట కుపక్రమించును: ప్రవేశము: శంభాజీ.]

శంభా—శేటుగారూ!——

తుకా—(క్షణమాతనిఁజూచి వ్రాసిన దానిని చదువుచు)

సీ. శివునివిల్ విఱచుచో సీతనుఁగాంచుచో,
వీరశృంగారముల్ వెలయుమోము;
అలవిరాధునిఁగూల్చు నపుడు మానులఁబిల్చు
నపుడు కిన్కముదంబు లరయుమోము;
ధరణిజప్రణయింప ఖరదూషణుల నొంప
యనురక్తి రక్తిమ లలరుమోము;
భానుజుతిలకింప వాలినిపరికింప
కామమోక్షదకాంతి కనెడుమోము;
గీ. క్షితి కబంధుని ముక్తునిఁ జేయుమోము;
జలధిగర్వంబు నణఁచిన చెలువుమోము;
విశ్వమోహన శుభదమై వెలయుమోము
గాంచి ముదమొందు భాగ్యంబు కలుఁగఁగలదె. ?

శంభా—తుకారామ్‌గారూ!

తుకా—అబ్బ! గట్టిగ మాట్లాడకుము- (నవ్వును.)

"మాయాజాళనాసే మానామేకయాసీ। ప్రీతిచక్రపాణీ అసోంధ్యాసీ!
అసోంధ్యాసీప్రీతి సాధూచాపాయాసీ। కథాకీర్తనాసీసోపానయే!
సోపానయే పురాణశ్రవణకీర్తన। మననవిజధ్యానసాక్షాత్కార!
సాక్షాత్కారస్ఫూర్తి మాసహజసమాధీ! తుకాహ్మణేవుపాధిగేలీత్యాచీ"
(మహారాష్ట్ర భాషయందలి తుకారాము కృతాభంగము.)

శంభా—ఇదియేమి? యిచ్చట నేమి నడకుచున్నారు!

తుకా—ఆఁ- నేనా? అపారసంసారపారావార సంఘాతమునుండి దరిఁ జేరుటకై చక్కనిపాలము నన్వేషించుచున్నాను.

శంభా—ఇచ్చట నెంతకాలముండెదవు?

తుకా—ప్రకృతిగమనికకి నాపై విరక్తి కలుగువఱకు.

శంభా—నీ కాహారమునకు దారి?

తుకా—కవితాకన్యకాకరకమల సమర్పిత పాండురంగ సంకీర్తనామృతపానమున!—

శంభా—బాగున్నది- అదే! అందున్నదే నాపొలము. చూచితివా! ధాన్యమంతయు కంకులపై సిద్ధముగనున్నది. అవియే పక్షులు. కనిపించుచున్నవా! ఏమందువు? నీవిందేయుండి యాపక్షులను చూచుచుందువా! నీయాహారమును నేసమకూర్చెద!

తుకా—తప్పక చూచుచుండెద!

శంభా—నిక్కమా! నీపైభారముంచి నేవెడలవచ్చునా? ఇందేమైన పొరబాటుగలిగెనా సకుటుంబముగ నేనాకలిచే మాడిచావవలసివచ్చును. ఏమందువు? అర్ధనిమేషమైన కనులు మూయరాదు.

తుకా—వెఱ్ఱివాఁడా! పక్షులనుమాత్రమేల? పశువుల, రాళ్ళగుట్టల ప్రకృతినంతయు చూచుచుండెద! (కనులు బాగుగతెఱచి)

ఇట్లుచూచుచుండెద! చాలునా! ఇఁకపొమ్ము! (శంభాజీ-నిష్క్రమించును.) హేచిద్విలాసా! శ్రీనివాసా! ఆగర్భశ్రీమంతునింట జననమొసంగితివి. వ్యాపారమే వృత్తిగ సంఘటనమొనర్చి శేటు తుకారాముగ నొనర్చితివి. పొలమునందలి ధాన్యమునకును, నాకును, నెట్టిసంబంధములేకున్నను నిప్పుడీపొలమునకు కాపరిగ నియోగించి, 'దాసతుకారామ్' గ నొనర్చితివి. సంసారమహాక్షేత్రమునను సుఖదుఃఖఫలానుభవించుచుండు తపస్సునిగనుండునట్లు చేసి 'వైరాగ్యదాసతుకారామ్' గ నెన్నఁడొనర్తువోకదా? ఆహా! యివియేమి? పక్షులు. తండోపతండములుగ వచ్చుచున్నవి. రండు- పులుఁగులారా! రండు! (అసాన్న సూచకకరతాళధ్వానములు పక్షులెగిరిపోవుట- దీనముగ)

ఆఁ- ఆఁ! పోవకుఁడు- ఓవిహంగమతతులారా! యేలపోయెదరు? మీకిలకిలారావములచే నన్నేల నిందింతురు? నేను నిరపరాధిని- ఓ! నాకరతాళధ్వనులచే భీతిల్లి పరువెత్తితిరా? ఎంతవెఱ్ఱివారలు! తుకారామ్ ప్రాణికోటికి దాసుఁడు. చలిచీమనైన బాధింప నసమర్థుఁడు రండు! ఆఁ- వచ్చితిరా తినుఁడు? యిదే స్వామియాజ్ఞానుసారినై క్షణమైన నేకనులు మూయక కనులార చూచుచునేయున్నాను- ఉ—

గీ. తినుఁడు; కడుపారనిపుడె? సందేహమేల
రేపు మఱల లభించునో? లేదొ? నరుల
భంగి మీలోన కలహింపవలదు; ప్రాప్త
మున కసంతృప్తి జ్ఞానిలక్షణము కాదు.

ఆనందము- ఆనందము. ఈతిర్యగ్జంతుసంతానమునకున్న యానందమునైతము మానవసంతతికి లేదుకదా!—

[ప్రవేశము: గంగాధరుఁడు]

భుజింపుఁడు. బ్రాహ్మణగ్రంథకములను సేకను పారభుజించి, మీమీ కులాయములకు చనుఁడు. లోకబాంధవుఁ డస్తమించిన, పాపము మీకు బాగ తెలియునట్లు?

[ప్రవేశము: రామేశ్వరభట్టు దూరమున]

రామే — పతిగృహమును సాజరమునువీడి, నాకరకమలములంకరింప నున్న నీశాకీరరాజమును తప్పించితివి- ఆకర్షించితివి. నాస్వైర పద మలంకరించితివి. తుకారామ్! నీవైన దానిసగుణిపెముగా నానందించితివా? సాత్త్వికత్వమును మహాపధమున దానిని సిరాం పమొనర్చితివి.

తుకా — ఆనందము. ఆనందము. ఈబ్రాహ్మణస్వామి యెంతటిపుణ్యశాలి, ఈపక్షికనులు సగమాత్మతో భూరిభోజనమునకు సాక్షీభూతుఁ డనై యుండ నిమంత్రించి యెంతయుపకారమొనర్చెను. ఆనందము. ఆనందము!

గంగా — తీరినది. సంపూర్ణమైనది. ఈభావోన్మత్తునకు పొలము నప్పగించిన శంభాజి ననవలయుఁగాక!- తుకారామ్! నీకు జ్ఞానమున్నదా?

తుకా — అభివాదములు. స్వామీ! నాకా- (తలగోకికొనుచు) జ్ఞానమా! లేనట్లాఁబోలు!- జ్ఞాని భూసురేంద్రా! కామక్రోధాదుల మాని దైవసంప్రాప్తమున సాఫల్యాభమునకై, సంతసించుచు, యనంతపరమానందమున కాలక్షేపమొనర్చు నీపక్షిసముదాయమునకును పరమవైరాగ్యధనులగు మీకును భేదమేమి?

గంగా — అవివేకీ! పక్షులతో మముబోల్చితివా?

తుకా—అదికాదు (పశువులచూచి ఆనందమున) రండు ! రండు ! ఆనందము ! నిలచితి రేల ? ఓ ! కంచె యడ్డముగనున్నదనియా ? ఆగుఁడు. నేఁదీసెద. యింక నేమియు నడ్డులేదుకదా ? తినుఁడు. ఆనందము. ఆ ! ఆ ! పక్షులారా ! పోవకుఁడు. పోవకుఁడు. స్వామీ ! నీరకుంచున్నది ?

గంగా—ఏల ?

తుకా—అబ్బా ! శీఘ్రముగ వచింపుఁడు.

గంగా—మూర్ఖా ! మాతోట ముండ్లకంచియ నంతయు తీసి పశువులకు దారిఁజేసితివా ?

[ప్రవేశము: జిజియ ఆహారముతో]

తుకా—తోలుత నీరెందున్నదో వచింపుఁడు ! నీరు త్రావకున్న పాప మాపక్షులకు బాధకలుఁగదా ? బాధకలిఁగిన మందిచ్చునై ద్యులుఁగలరా ?

గంగా—నీరుకావలయునా ? అవివేకీ ! యిదిగో ! కన్నీరురాఁగలను (కొట్టుచు) శంభాజీ ! శంభాజీ ! !

జిజి—ఆ ! ఆ ! ! యిదియేమి ?

[ప్రవేశము: శంభాజీ]

శంభా—అయ్యో ! అయ్యో ! యిదియేమి ? నాధాన్యమంతయు నాశనమైనదే ? ఓసీ ! అధమా !

జిజి—నోరుబిగియబట్టి మాట్లాడుము

శంభా—మూర్ఖా ! నాధాన్యమును నాశనమొనర్చితివా ? (కొట్టును జిజియా అడ్డగించి)

జిజి—ఆఁ ! ఆఁ ! మీరు మానవులేనా ? అయ్యో ! రక్తముసైతము కారుచున్నదే ? పాండవల— నాథా !

(గంగాధర, శంభాజీలు నిష్క్రమము.)

జిజి—నాథా ! మీకేల యీయనవసర బాధ ! ఊరక కుడిచి యింట కూర్చొనుమన్న వినక యిచ్చటికిరానేల ? పనులచే బాధపడనేల ? నాకును మీకును యవమానము నాపాదింపనేల ?

తుకా—బేలా ! సర్వమునకును మానవుఁడు కర్తయని తలఁచితివా ?

(అనుబంధము 16.)

యవనికపతనము.

---

దృశ్యము: ౨.

సమయము: మధ్యాహ్నము.

[తుకారాము గృహము: శ్రాద్ధపరికరములన్నియు సమకూర్పఁబడియుండును. బ్రాహ్మణుఁడును, తుకారామును నుపవేశించియుందురు. మహాదేవుఁడు రోగపర్యంకమున పరుండియుండ- చెంత జిజియా నిలచియుండును. వైద్యుఁడొకఁడు మహాదేవుని పరీక్షించి- నిస్సందేహముగ జిజియాకు సంజ్ఞచేసి వెడలిపోవును. ప్రవేశము: రుక్మి. కొన్ని యాహారములు గొనుచు- ఉపవాసము.]

రుక్మి—ఈదినమే, నాకును- యీప్రపంచమునకును ఋణానుబంధము తీఱునట్లున్నది. ఈపాతభాగిని జీవితచారిత్రమున నిఁక 'రేపు' అను దానికి తావులేదు. శ్రీహరీ ! పాండురంగా ! నా ప్రత్యక్షదైవమగు నాథుని సేవ యీనాఁడైన మనసార చేయనిమ్ము (సమీపించి) సోదరీ ! జిజియా ? నాథుఁడేమి చేయుచున్నాఁడు ?

జిజి—నీశ్రాద్ధము బెట్టుచున్నాఁడు ! విధవపీనుగా ! కనిపించుటలేదా మహాదేవుఁడు బాధపడుచుండుట ?

రుక్మి—జిజియా ! మహాదేవునిపై నాకుమాత్రము ప్రేమలేదా ? కాని- నేఁడేలకో నేనెంత ప్రయత్నబలమున నణంచుకొన్నను

నాకాయాసమధికమగుచున్నది- ప్రాణములు- నిలచుపరిపా టిలేదు.——

జిజి——ఏమిా? నేడింట మామగారి యాబ్దికము జరుగుచుండ నీకు మరణమా? చావ నేవలయునన్న సంవత్సరమున నెన్నిదినము లులేవు? చచ్చినను మమ్ముల బాధింప శ్రాద్ధదినమునే యేర్పఱ చుకొంటివా?

రుక్మ——జిజియమా! అది నాయత్నమా?

జిజి——అధికప్రసంగములు మాని చావనేవలయునన్న రేపటిపఱకును చావకుము! ఈదినమే చత్తునందువా మూలకూర్చొని క్రిక్కు రుమనకుండ చావుము.

రుక్మ——బాధ- గుర్భ- రము- దైనమా!

జిజి——ఏమా దొంగవేసము! నీకు సామవచనములు పనికివచ్చునా? (కొట్టును.)

రుక్మ——అయ్యో! జిజియమా! (క్రిందపడి నోరుమూసుకొని) బాధచే నలిచిన నాథుని ప్రశాంతమునకు భంగముకలుగదా?

జిజి——బాధ- గీధ- గయ్యాళీ! ముఱల నాటకమా (కొట్టును: రుక్మ క్రిందపడును. తుకారాము చెంతకేతెంచును.)

తుకా——జిజియమా! జిజి యమా! జి జి యమా!

జిజి——నాథా! పతి. దేవా! జీ వి. తేశ్వ రా? (అనుకరించును)

తుకా——చావమన్నదానిపై కోపమా! జిజియమా! రుక్మా! రుక్మా! ఒక్కమాటాడవమా! నామాటవిన్నదు మాటువలికియెఱు గవే? వేడికొనినను కరుణకలుగదా? ఏలపలుకవు? నీవు దైవ సమునిగ పూజించు నిర్భాగ్యుడగు నీనాథునిపై యనాద రణమా?

యందఱిబొమ్మనీనాపాంజలులకు శిరమొడ్డి చచ్చియు చావక జీవచ్ఛవంబువోలె నీనాథుఁ డింకను బ్రదికియేయున్నాఁడు. చావలేదు. ఇం యున్నాఁడు.

రుక్మ——(తుకారామ్ సమీపింప) నాథా! ఆయాసము— క్షమాపణ_

తుకా——క్షమాపణయా? దేనికి? నాయట్టి నిష్కరుణకఠినకిరాతకచండాలున కర్ధాంగినివైయైనందుకా? అయ్యో! దేవీ! ఎట్టిదుస్సహబాధల ననుభవించుచున్నను, యెంతటి మహాత్తరకార్యకరణసంతాపమున మునింగియున్నను, నేను చెంతకేతెంచి "రుక్మా" యని పిలచినంత నీవొక్కతెనైన మందహాసమున "నాథా!" యని పలుకుచుంటివే? నన్నిక యాదరించువా రెవరు? మాటలాడించువా రెవరు? దైవమా! యీసంతసమొక్కటైన యీనిర్భాగ్యునకుండరాదా? రుక్మా! నీవు సాధుచారిత్రవే? పరమపతివ్రతాశిరోమణివే? నీకా యీయకాలమరణావస్థ! నీకా యీఘోరహింసాయుక్తదుర్మరణము.

[ప్రవేశము: శంభాజీ]

శంభా——ఓరీ! దొంగా! తుకారామ్! ఎందుదాఁగితివి?

జిజి——(కోపమున) పోమ్మావల. దురాత్మా! యింట మేమే చచ్చుచునుండ నీబాధయొక్కటియా?

శంభా——చచ్చినను సరియే- మంటగలిసినను సరియె. మీరేయేటము నీఁగిన నాకేమి? (తుకారామ్ స్తబ్ధుఁడై యుండ మెడబట్టి) ఓరీ! తెమ్ము! నాధాన్యమును.

తుకా——నీధాన్యమా? సోదరా! "నీవి" యను ధాన్యము నాపశువులును పక్షులును నారగింపలేదా? భుజింపఁబడినవాని మఱల తెమ్మన్న నేనివ్వగలనా?

శంభా—ఇవ్వకున్న నీవొనర్చిన ధాన్యనాశనమునకై నేను సకుటుంబముగా చావవలయునా?

తుకా—వలదు. సోదరా? మీయందఱిప్రాణములా ధాన్యముపైననే యాధారపడియున్నవా? నిక్కమా? రాజాధిరాజులనైన సరకుగొనని మృత్యుదేవత నీధాన్యముపైననే యాధారపడియున్నదా? కానిమ్ము! యీగృహముననున్న వస్తువులన్నియు నీయిచ్చవచ్చినవానిని గైకొని విక్రయించి సుఖముగ స్థిరజీవులైయుండుఁడు.

జిజి—ఆ! ఏమిత్యాగము. దానకర్ణులు! యింట నేమూలచూచినను ధనరాసులు మూల్గుచున్నవనియా యిచ్చవచ్చినరీతి దానమొనర్చుచున్నారు.

తుకా—దేవీ—

జిజి—చాలునిఁక. పడియుండుమావల. నీయట్టి చేతగానివానికి పెత్తనములుకూడనా? ఓరీ! అధమా! ఊరకపోయెదవా లేదా?

శంభా—కదలను. నేఁడు నాధాన్యమైనరావలయు. లేకున్న నాప్రాణమైన పోవలయు.

తుకా—దేవీ! వేడికొందును నాకొఱకుగాకున్న యనాదిగ మీవంశమునకే విమలయశశ్చంద్రిక నార్జించిన పతిభక్తికొఱకైన—నీవింకను కొంతకాలము సుమంగలీత్వమును కోరుదువేని యీవిషయమున మాత్ర మడ్డురాకుము.

జిజి—బెదరింతువా? వలదు. అడ్డమువచ్చిన నీకు పాదరక్షాప్రయోగము తప్పదు.

తుకా—(తలవంచి) శ్రీహరీ! రంగా!

జిజి—కన్నవారి పాదరక్షాప్రయోగముఁ సైచుటకన్న భార్య పాదరక్షాప్రయోగమధికమా!

తుకా—రంగా! పాండురంగా! నీకరుణ - నీదయార్ద్రభావము—నీభక్తజనపరీక్షా మనీషయు—ప్రతిమానవము—అనిర్వచనీయము. నేనువ్యర్థుండనే? పాపపంకిలనిమగ్నుండనే? మమకారబాధితుండనే? యీవిషమపరీక్ష భరింపగలనా? అమ్మో! ఈసంసారదవాగ్ని యంతకంతకు దుర్భరమగుచున్నదే? దేవీ! కృతజ్ఞుండ చక్కని యుపదేశమొనర్చితివి. ఆజన్మముం దీని మఱువను నీయుపకార మీజన్మమున తీర్పజాలకున్నను ముందుజన్మమునవైన తీర్తును.

మహా—అమ్మా! (తుకారామ్ సమీపించును.)

తుకా—ఏమి నాయనా?

మహా—వలదు. నాచెంతకురావలదు. ఈకొన్నిఘడియలైన జీవించియుండుట నీకిష్టములేదా? ఏమీ! అవివిక్కుంపు కన్నీటిధార లేనా?

తుకా—కావు. తనయా! యివి కన్నీటిధారలుకావు. శోకభరంబునను నీనిందావాక్యభరంబునను కఱిగి కన్నీటిరూపమున ప్రవహించు నాపంచప్రాణసర్వస్వ ధారలు. మహాదేవా! నీవొక్కమరణబాధ ననుభవించుచున్నాఁడవు కాని, యీలోకమున నేవైద్యులచే కాని, యేయోషధీరాజములచే కాని యెన్నటికిని శాంతి నందని వేదనాయాతహింసాగ్ని నిర్దహించుచుండ క్షణక్షణమునకీ నిర్భాగ్యుం డనేక శతసహస్రమరణవేదన లనుభవించుచుండ లేదా?

జిజి—నిక్కమే? అయిన చావరేల?

తుకా—దేవీ!

జిజి—ఔను. కన్నవారి పాపరక్షాప్రయోగములు సైఁచు నీకు సతిగా నుండుటకన్న విధవనై యుండుట మేలు.

తుకా—(మోకరించి రెండుకరముల శిరమును పట్టుకొని జిజియాను చూచుచు) ఓ తుకారామ్ నానుక జీవచ్ఛవమా! యింత తిన్ని విధముల నీమృతికై శాపోదములొసంగుచున్నను నీవ్యర్థతరజీవితగ్రంథమున కానలున "సమాప్తి" యని వ్రాయనేలేదా? లోకమున ప్రాణులందఱికి సుఖదుఃఖములనేగాక యందఱికి నాయుఃపరమాణములును యాపరమేష్టి నీకేయొసంగెనా? (గొంతుక బట్టి నులుముకొనుచు) నిన్ను బాధించి హింసించినను నీకుమృతి-

రుక్మ—(కనులు తెఱచి) నాథా! జీవితేశ్వరా!

తుకా—(చేతులు నేలపైనాని క్రిందచూచుచు) లేదు. జిజియా! లేదు. ఈనిర్భాగ్యునిపై నామృత్యుదేవతకును కరుణలేదు (తలయెత్తి) ఈకలుషాత్ముడింకను నెందఱిని హింసించి వధింపవలయునో? ఎన్ని వేదనాహింసల ననుభవింపవలయునో!

రుక్మ—బాధ! ఆయాసము. నాథా!

తుకా—అనుభవింపుము. దురదృష్టదేవతా! యీనిర్భాగ్యున కర్ధాంగియైనందున కలుగు ఫలమును సంపూర్ణముగ ననుభవింపుము. నన్నేలపిలచెదవు? బ్రతికియున్న యీనిమేనమేని శాంతిలేక నాస్పర్శచే లోకాతీతవేదనల ననుభవింప నెంచితివా?

శంభా—తుకారామ్!

తుకా—గైకొమ్ము. యీఇంటియందలి వస్తువుల—

జిజి—వలదు. ఒక్కవస్తువునుతాకితివా శిరము బ్రద్దలగును. (యిక్షుదండమును ధరించి)

తుకా—సంతోషము. నేనేయొసంగెద. యీపాండురంగని యమేయమాయారామహేమము (పోటుపోవ జిజియాకొట్టును చెరుకు రెండుముక్కలగును.)

జిజి—ముష్టీ! అయినదా?

తుకా—(క్రిందనున్న చెరుకుముక్కల చూచుచు) ఈకఠినకర్మని శిర స్పర్శచే రూపుమాసిబాపతితవైనను యీదీనునకు ధర్మోపదే శమునే చేయుచున్నదానవా? ఔను! జిజియా? యిక్షుదం డము రెండుతునకలైనను సినాథుని శిరము బ్రద్దలకాలేదని చింతింపకుము. అది నిదోషముకాదు. కాంతా! యీదీనుని శిరముమాత్రమే గాక హృదయముసైతము కఠినశిలాసదృశము గుచుండ నీవేమిచేయగలవు. (శంభాజీవైపుచూడకయే) సో దరా! మనవివాద మీయిక్షుదండమే పరిష్కరించె. ఇందలి వస్తుసమూహామునం దర్ధము కుటుంబముపాలు. రెండవ యర్ధము నాపాలు కావున (మెడనున్న హారముతీయుచుండ)

[ప్రవేశము: గోపీచంద్ను ఉద్యోగితో]

గోపీ—వలదు- వలదు. యీఆస్తియంతయు నాయధీనమైనది. ఇందలి చిల్లిగవ్వయైన తాకవలదు.

జిజి—చందుగారూ! ఏమి యీయాగడము.

గోపీ—ఇదియా? బాకీని వసూలుచేయు యాగడము. అయ్యా! ఉద్యోగిగారూ! నిలచితిరేల?

జిజి—అయ్యా! యిదియా మమ్ము బాధించుటకు సమయము. మేము పారిపోవువారమా! ఆస్తిలేనివారమా?

[ప్రవేశము: రామేశ్వరభట్టు వేరొకవైపునుండి]

రామే—తుకారామ్! ఏదీ నాజీతము.

జిజి—ఏమయ్యా! బ్రాహ్మణా! నీకు కనులు తలకెక్కినవా? నీయజ మానిని, దయాపూర్వకముగ నినుఋణవిముక్తునిచేసి నిన్నుపా లించి పోషించుచున్న నీస్వామిని నేకవచనమున సంబోధిం తువా? ఏదీ! ధనము. గోపీచందుగారి బాకీకై కావలయును.

రామే—ఎంతున్నది ధనము ?

జిజి—ఏమీ! నీవు మావ్యవహారములన్నియు చూచు దివానువు కావా ? ఏది! మూలధనముగా దాచియుంచిన మూడువేలవరహాలు ?

రామే—నష్టము. వ్యాపారమున నంతయు నష్టము !

జిజి—నష్టమా! అంగడియందలి వస్తుసమూహము ?

రామే—అప్పులవారిపాలు.

జిజి—పరిహాసములుకావుసుమా ! పేటికయందు—

రామే—చిల్లిగవ్వయైనలేదు.

గోపీ—మోసము. మోసము. అయ్యా ! ఉద్యోగిగారూ ! నిలచితిరేల ?

తుకా—ఆగుడు. చందుగారూ ! ద్విజచంద్రమా ! ధనమేమియునిలువలేదా ? కానిమ్ము. నాపైతృకమగుస్వత్వమంతయు విక్రయించియైన యీచందుగారి బాకీధనమిప్పింపుము.

రామే—నమ్ముకుడు. చందుగారూ ! ఆస్తియేమియులేదు.

జిజి—మూర్ఖా ! మాపొలము—

రామే—గోష్పాదమంతయు లేదు.

జిజి—ఏమీ ! యీయూరనున్న మాగృహములు- భూములు- తోటలు—

రామే—అప్పులవారిపాలు అందర్థము నాబాకీకై- విక్రీతములైనట్లు నీనాథుని స్వహస్తలిఖితపత్రము లున్నవి.

జిజి—ఆఁ- ఆఁ- దురాత్మా ! నీవు బ్రాహ్మణుడవేనా ? నీవు మానవరక్తముననే జనించితివా ? (సమీపింప)

రామే—మరియాదగ దూరమున నిలుము. ఎవరికికావలయు నీయుద్యోగము ? కావలసియున్న నీపతినే నాచెంత—

జిజి—ఆఁ! బ్రాహ్మణహతకా! నీవు మనెదనా! అయ్యా! రాజకీయోద్యోగిగారూ! బంధింపు మీస్వామిద్రోహచండాలుని—యిదియే—యిప్పుడో- యింక క్షణమునకో చావనున్న నాకు మారునియాన- యీపాఱుఁడు స్వామిద్రోహి- కృతఘ్నుఁడు- చోరుఁడు- లేకున్న వచ్చినరెండుమాసములకే యీగోచిపాత రాయఁడు రెండువేలనిష్కములస్వత్వమును సంపాదించునా! ఊఁ- బందింపుఁడు- (ఉద్యోగి బధింపఁబోవ)

తుకా—ఆగుఁడు—వదలుఁడా బ్రాహ్మణుని. పోయినది నాధనము కదా! నే క్షమించుచుండ- నాకు లేనికోపము మీ కేల? ద్విజచంద్రమా! ఏదీ నన్నొకతూరి చక్కఁగ పరికింపుము. మీకంత ధనముపై నాశయేయున్న నాతో నేలవచింపవైతివి? నేనే మనసార- చేతులార- నాస్వత్వమునంతయు- పరమసంతోషమున నొసంగుచుంటినే! ఔనా! నిక్కమా! నాధనమంతయు పోయినదా! నాస్వహస్తలిఖితపత్రములున్నవా? ఔను. సత్యదేవత కావాసస్థానమైన నాలుకయే యిచ్చివచ్చినరీతి తిరుగుట కుపక్రమించిన పత్రములుమాత్ర ముదయింపవా! మఱిచితి- కావలసిన మీచెంత నౌఖరుపదవి నిత్తురా! సంతోషము! ఇప్పుడు నన్నావరించిన యాపద లించుక తొలఁగిన- సంతోషమున నంగీకరింతు.

రామే—ఏమీ! ధనమునకేనా!

తుకా—ఆఁ- ఔను- మీరెంతనిర్నామమొనర్చినను యింకను చచ్చియు చావక పరితపించు మీమానససాక్షిణీదేవత నుద్బోధించి—మీకును- నాకును- యామోక్షధనమును సంపాదించుటకై- కానిండు- ద్విజేంద్రా! ధనమేమో యార్జించితిరి- కాని—

గీ. ధర్మభంగి మాచార లాధనముఁ గూర్చ,
చనియె, నదియు, చెప్పకయె నన్ వనట ముంచి;
ధర్మహీనత గూర్చి తద్దాని హెచ్చు
రికనినున్ గూడ వంచించి యేగునేమొ!

పోయిరంటు! ద్విజేంద్రా! నాభార్య క్రోధమానస! ఆయమ
యిమ్మనియు ననకమునుపే పోయిరంటు!

రామే—పోవుటయా! నాకింకను రెండుమాసములుజీతము రావలసి
యున్నది. దాని నిచ్చినకదా!—

జిజి—ఇంకను నీకు జీతమా! ఓయీ! కులపాంసనచండాలా! నీవు
కఠినకిరాతకర క్తమున జనించితివా?—నీకు దయాదాక్షిణ్య
ములు లేవా?

రామే—కార్యవాదిని దయాదీక్షణ్యములు, యుచితానుచితములను
బాధించునా?

బ్రాహ్మ—శేటుగారూ! నేఁడేమి శ్రాద్ధకర్మ యున్నదా? లేదా?

తుకా—స్వామీ! దయాపూర్వకముగ నీద్విజేంద్రుఁడు బ్రదికియున్న
మాకందఱికిని నొక్కనిమేసమున శ్రాద్ధము చేయించుచుండ
చచ్చినవారికి మీరు చేయింపఁజాలరా?

మహా—(పర్యంకమునుండి యర్ధము లేచుచు) ఆఁ- ఆఁ- రాను-
రాను- నాతల్లిదండ్రుల నదలి నేను రాను. అయ్యో- బాధ-

తుకా—
జిజి— } (చెంత కేతెంచి) మహాదేవా! మహాదేవా!

మహా—రక్షింపు- ము- అయ్యో- భ- య- ము- అమ్మా- హా- భ-
వా- నీ- (మరణించును.)

తుకా—
జిజి— } హా- మహాదేవా!—శ్రీహరీ!

రా. ఉ——(ఇంటనున్న వస్తువుల తీసి బయటవైచినతరువాత మహ దేవునిపర్యంకమును సమీపించి ఈడ్చివేయు మీాశవమును. మా కీమంచము కావలసియున్నది——

[తుకారామ్- క్రోధాశ్చర్యసంతాపముల చూచుచుండ]

జిజి——అయ్యో! యిదియా సమయము!

గోపీ——మానకుండు. ఆమంచముక్రింద నేమైన దాఁచినారేమో!

ఉ.ద్యో——(మహాదేవుని శవముపట్టి) తీసివేయుము——

తుకా——ఆఁగుము- నిలుము దూరమున! నీవు భారతీయుఁడవేనా! మానవజనసామాన్యములైన దయాదాక్షిణ్యపశ్చాత్తాపములు నీయందుమాత్రము నేఁ డట్టె విధ్వంసితములయ్యెనా? ఈబాల కుని తుదియుచ్ఛ్వాస మింకను తనవేఁడిమిని బాయలేదే! నీకు పాపభీతి లేకున్నను- పీనిమోమున తాండవమాడుచు- తుద కందఱును నాబాఁటఁ జిక్కుట తప్పదని చెప్పకచెప్పుచున్న మృత్యుదేవతను గాంచిననైన భీతికలుఁగదా?

గోపీ——(ఉద్యోగి సందేహింప) పోయెదవా? ఉద్యోగమునకు దత్తాం జలి యొసంగెదనా! (ఉద్యోగి సమీపింప)

తుకా——మానవా!- మానవా! మానవరూప ఘోరకఠినపిశాచమా! (రెండుచేతుల నుద్యోగికంఠమును బట్టి) తనువుపై నీ కాస లేదా?——

రుక్మ——(ఇంచుక లేచి) శాంతము- శాంతము- జీజీ!——శాంతము-

తుకా——(స్తబ్ధుఁడై- చేతులు తమంత యుద్యోగికంఠమును వీడ) ధన్యవు- రుక్మా!- ధన్యవు! దుర్భరమరణావస్థనుండియు నీయ ర్ధాంగినీత్వమును సార్థకపఱచి, నేను దురంతక్రోధపిశాచమునకు బానిసనగుటఁ గాంచి- యజ్ఞానావస్థనైన- 'శాంత' మనెడిమంత్ర రాజము నుపదేశించితివా! ధన్యవు! రంగా! వైనతేయతు

రంగా ! నీ వపూర్వకరుణాసముద్రుఁడవు ! అయినదా ! యింకే
మైన నున్నదా ! చూతుము. వెదకుము భక్తచారిత్రములనెల్ల-
క్రొత్తక్రొత్తబాధల. క్రొత్తహింసల నీవికై సృజింపుము.
అపుడు నీ వార్తరక్షకుఁ డగుదువు. దీనశరణ్యుఁడ వగుదువు.

జిజి—చంద్రుగారూ ! మమ్మిట్లు బాధించుట న్యాయమా ?

తుకా—బేలా ! నీ కింకను పిచ్చి వదలలేదా ? అయ్యా నాభార్య
పొరవడియె ! ఆతన్ని మీరింకను సువివేకమానవజాతికి చెందిన
వారనియె భావించుచున్నది. క్షమింపుఁడు—కాదు—పాపము—
మీహృదయములమాత్ర మాపరాత్పరుఁ డయోమయాకరాళ
శిలలచే నిర్మించెననుట యాతన్వాంగి యెఱుంగదు. ప్రపంచమున
నందఱు గతించినను, మీరుమాత్రము, మీ యన్యాయద్రోహ
కార్యములచే వార్జించినధనరాసిని సింహాసనముగఁ జేసి, కలకాల
మిట్లే మనియుందురని యెఱుంగదు. కానిండు; నిరపరాధియగు
నొక్క బాలకునియొక్కయు, నబలయొక్కయు ప్రాణము లున్న
నేమి ? చన్న నేమి ? లోకమున ధనమేకదా ప్రధానము. ఆఁ-
జిజియా ! మహాదేవుని- కాదు- మహాదేవునిశవమును—దుఃఖిం
పకుము. బేలా ! దుఃఖించుటకు మనకు వ్యవధియేదీ—ఆవల
నుంచుము- వలదు-

గీ. చనుచునున్నారు ప్రతినిమేసంబు, ప్రాణు
లెంద, ఔందఱో వారికై యేడ్చి రబల !
మఱల రా రొక్కరును, కృపామతిని, బేల !
మృత్యుహృదయంబు కన్నీట మెత్తవడునె ?
లేక యేడ్చెదనందువా ? బిగ్గరగ నేడ్వుము ' నీరోదనధ్వానము
లే రోదసీకుహరము నిండి, యీయజాండభాండమును భేదించి,
యందెందోయుండెడి యావేదండవరదుని హృత్పుండరీకమున

దాఁగియున్న కరుణ, దయ, వాత్సల్యము:ఖల వెలికి లాగఁగల వేమో చూచెద! రుక్మా! రమ్ము! పరలోకమున కేగుచు, పరమపాతకియగు నీపతితొడపై నించుక విశ్రమింపుము! మర ణించువానికి మంచమైననేమి—మంఁటనగ్నియైననేమి.

జిజి—నాథా!—

తుకా—శాంతము! మృత్యుదేవతా! నీకపుడే యొకప్రాణమును బలి యొసంగితి. నీవిపుడు గ్రసించుచున్న యీాయమూల్యరత్నము వెల యెఱుంగుదువా! ఇది లోకాతీతపతిభక్తిసమేత! రుక్మా! నన్నిఁక యాదరించువారెవరు? మాటాడించువారెవరు? దైవ మా? యీసంతస మొక్కటియైన యీనిర్భాగ్యున కుండ రాదా! పరుండుము రుక్మా! యిదియే నీనాథుఁడు నీకొనర్చు కడపటియుపచారము. ఈనిర్భాగ్యునియంక పేటికయే నీమరణ శయ్య! వింటివా! నీని కీవిశాలప్రపంచమున యీశరీర మొ క్కటితప్ప నాయనునదేదియును లేదు.

[ప్రవేశము: రాజభటుఁడు.]

జిజి— ఇదియేమి మఱల క్రొత్తయనర్థము!

రా. భ—శేటుగారూ! మీాదివాను రామేశ్వరభట్టు నేరారోపణచే మిమ్ము బంధింప రాజాజ్ఞ యైనది.

తుకా— అయినదా! ద్విజచంద్రమా! ఈశరీర మొక్కటియైన 'నాది' యని భావించియుంటిని. దానినిసైతము ఛేదించి, దాసున కీయు పకారమును మీారే యొనర్చితిరా! సంతోషము. (భటునితో) నిలిచితివేల? బంధింతువా! కానిమ్ము! రుక్మా నీ కీయాశ్రయ మునుకూడ దైవము తీసివైచెను. నే నేమిచేతును. అనుభవిం పుము! శృంఖలములఁ దెచ్చితివా! బంధింపుము. కావలసినదే!

తుకారామ్! పాండురంగఁడనియు, భక్తియనియు విశ్వసించి నందుల కీప్రతిఫలము నీకు కావలసినదే!

బ్రాహ్మ—శేటుగారూ! శ్రాద్ధకర్మ యున్నదా! లేదా?

తుకా—సందేహ మేల? దయాపూర్వకముగ నీబ్రాహ్మణోత్తముఁడు బ్రతికియున్న మాకందఱకని నొక్కనిమునమున శ్రాద్ధము చేయించుచుండ వచ్చినవారికి కొఱంతకల్గునా!

శంభా—ఓరీ! దొంగా! నాభాగ్య మేదీ? నాగతి యింతయేనా?

రామే—నాశనము తుకారామ్!

తుకా—దాసుఁడు—అభివాదనమునకు ప్పుటకైన యసమర్థుఁడైన—దాసుఁడు—ఈనిర్భాగ్యునిచేత నేమియు లేదే—తనువు రాజభటుల యధీనము; ఆస్తి—గోపీచందుగారి పాలు; భార్యాపుత్రులు—ఆపదలతపాలిటియధీనము; మానసమన్ననో—సకలాంగము ల నుడికించు దుఃఖ జ్వాల ప్రదహ్యమాన దుర్భర సంతాపాగ్నిపాలు! అయ్యలారా! మీకు తృప్తి యేకలుగునేని—వీనిచెంత—యింకను రక్తమాంసము లున్నవి—మీయిచ్ఛవచ్చినరీతి పంచుకొనుఁడు!

రుక్మ—నాథా! మాకేది గతి?

తుకా—మృత్యువు—రుక్మా!

జిజి—ఛీ-ఛీ- అందఱకిని చావమందువా?

తుకా—ఔను- అందఱికిని మరణమే శరణము! చావుము. రుక్మా! నీ కీలోకమున తావు లేదు బేలా! కలికాలమున—యీలోకమున—నినుబోలుసాధ్వీమణులకు తావు కలదా? చావుము—మీయిరువురి పరలోకప్రయాణమును, నా కారాగారప్రయాణమును నొక్కసారియే ప్రవర్తిల్లితీరవలయు. చావుము- మీ యిరువురిమరణమును కనులార చూచినకాని నాకు సంతసము కలుగదు.

రుక్మ—నాథా !- నాథా !-

తుకా—చచ్చితివని తలంచితినే! రుక్మా !- యింకను చావలేదా! బేలా! స్వార్థభూయిష్ఠమగు నీప్రపంచమును వీడి- యేలోక మునకో యేగుచు, నింకను 'నాథా' యని సంబోధించి యేల పాపమార్జింతువు? వీఁడు నీకు నాథుఁడా! పరేతనాథుఁ డగుఁ గాక! చావుము. (హృదయమును కొట్టుకొనుచు) చూచితివా! బాధలేదు- యీహృదయ మిపుడు కఠినశిలాసదృశము. హాహాహా— చావుము. జిజియా! నీవును చావుము బ్రాహ్మణా! నీవును- నీవు- అందఱును చావవలయు. రుక్మా! చావుము శీఘ్రముగ- ఆఁ- ఒక్కక్షణము తాలుత పైతృకర్మ- పిదప నీమారణకర్మ! కానిమ్ము! బ్రాహ్మణా! పిలువుము పితృ దేవతలను—

[బ్రాహ్మణుఁడు మంత్రము ప్రారంభింప:—
ప్రవేశము: గంగాధరుఁడు.]

గంగా—వీలులేదు- గురుధిక్కారమునకై యితనికి కులబహిష్కారశిక్ష విధింపఁబడినది.

బ్రాహ్మ— స్వామీ !—

తుకా— వీలు- లేదు- హాహాహా! వినిపించుట లేదా? వెళ్ళిబ్రాహ్మణా! నాకు శ్రాద్ధము జరిగినకాని, నాచే శ్రాద్ధకర్మ చేయించుటకు వీలు- లేదు. నీకును నంతియే రుక్మా! బ్రాహ్మణోత్తముల వేదమంత్రముల సాయములేకయే నీవు స్వర్గారోహణ మొనర్ప వలయు. చావుము. శీఘ్రముగ- పాపము మనయింటి కేతెంచు టకై- విమానారూఢులై పితృదేవతలు సిద్ధముగ నుందురు గాఁబోలు! నీవు- రుక్మా శీఘ్రముగ మరణించి- స్వర్గమున

కేగి- యో వెట్రిపిత్రుదేవతలారా! మీకు శ్రాద్ధము లేదు- మంత్రము లేదు- పిండప్రదానము- లేదు- తర్పణము- లేదు—

శంభా—నాధాన్యము తుకారామ్!

తుకా—లేదు- లేదు-

రామే—నాజీతము?

తుకా—లేదు-

గోపీ—నా బాకీ?—

తుకా—

ఉ. లేదు ధరిత్రి ధర్మకళ- లేదు జగంబున సత్యశక్తియున్
లేదు ప్రపంచసంభరణలీలయు, నీశ్వరభక్తి చిన్మయా
మోదవికాస మెందులనులే దదె లోక మలోకమయ్యె నా
వేదము, రంగఁడున్, స్మృతులు, విప్రులు, భక్తులు లేరు- లే రిలన్.

గంగా—అయినదా! తుకారామ్! కులక్రమాగతమగు గురువులపూజ మాని, రాళ్లనుండియు, చెట్లనుండియు నేర్చినవిద్యచే, పంచ ముని పాదదాసుఁడగుట కిదియే ఫలము! ఇదిగో నీరంగఁడు! (విగ్రహాముదు చేతికిచ్చుచు) గురువుగారేల? రక్షింప నీపాండు రంగఁడు కలఁడుకదా!

తుకా—కలఁడా? పాండురంగఁడు కలఁడా? ఏఁడీ—ఎక్కడ? ఎందు న్నాఁడు? చూచితిరా! యిదియా? మట్టిబొమ్మ! స్వార్థపరు లగు జడదారులు లోకవంచనార్థము నిర్మించిన మృణ్మయ విగ్రహము. లేఁడు- పాండురంగఁడు లేఁడు- వేదములు లేవు- భక్తులు లేరు- లేరు- హే సనకసనందనవందననందనా! నీవు కలవా? లేవు- లేవు- కల్ల- అసత్యము—అంతయు భ్రాంతి— ఓ పండరినాథా! నీవు పరమపదసనాథుఁడవా! కావు- కావు- నీవుండుటయే నిక్కమైన, వేదములు సత్యములైన- ప్రపంచ

మున హైందవమతమే యదార్థమైన- యేదీ రమ్మో! (విసరి నేలపై) హాహ్హాహ్హా! భ్రమించితివా! మూర్ఖమైతివా! హాహ్హా! ఎందుచనియో నీయమేయమహామహిమ! నన్ను రక్షింపఁజాల కున్నను తుదకు నిన్ను నీవైన రక్షించుకొనఁగలిగితివా! నీను హిమయంతయు నింతయేనా? హాహ్హాహ్హా! యిదిగో నిన్ను కాల రాచి——

(లోన- వీధిలో- రోహిదాసు- అనుబంధము.)

[తుకారామ్ చకితుఁడగును- మానసికగగనవీధి నావరించిన ప్రబలసందేహాగాఢతామిస్రమును భేదించు ఆశాపూరితవికాసము మందమందముగ నాక్రమించుచుండ- భటులచే నీడ్వఁబడుచుండ-]

యవనిక పడును.

---

దృశ్యము 3.

సమయము: సాయంకాలము.

[తుకారాము గృహసమీపప్రదేశము: రోహిదాసు: కొందఱు రాళ్ళురువ్వుచుండ- కొందఱు కసరుచుండ]

(అనుబంధము 18.)

రోహి——అకటా! పంచముల బాధలు- భరింపరానివే- ఏమిచేతును? రంగా!

గీ. ఏల సృజియించినాడ వీమాలజనుల?
నెవ్వ రేవేళ నిందించి హింససేయ
మారువలుకక తలవంచి బ్రదుక నీవె
వ్రాసితో నొసట? విధియొ? ప్రాప్తియేమొ?

(నిష్క్రమము.)

---

శ్రీరాజరాజేశ్వర్యైనమః—శ్రీసుబ్రహ్మణ్యాయనమః

# భక్త తుకారామ్.



## తృతీయాంకము.



### దృశ్యము: ౧

సమయము: ప్రాతఃకాలము

[గోపీచందుగృహమునందలి యొకగది; అద్దమును చూచుచు- నీళ- నిట్టూర్పు విడచి]

(అనుబంధము 19)

నీళ—(పాట నాపి) లేదు- భారతీయసారస్వతమున పాతివ్రత్యము- పతిభక్తి యను సువర్ణాక్షరములే కాని. ప్రణయము, సౌందర్యము లనునవి గగనకుసుమాయమానములు- వినుము. భక్తి- అంతయు భక్తి- స్వార్థభూయిష్ఠమగు భక్తికాదు- నిర్మలభక్తి- దానియందే ప్రేమ-

(అనుబంధము 19. యందలి చరణము.)

[ప్రవేశము: గోపీచందు.]

గోపీ—నీళా! నీళా!

నీళ—(చూడకయె పాడుచుండును.)

గోపీ—(సమీపించి భుజముపై కరమిడి) నీళా!

నీళ—(పాట నాపి- మగని నవలోకించుచు- మోకరించి-)

(అనుబంధము- 19—మఱల)

గోపీ—నీళా! మఱల యింటికి వచ్చితివా? (లేవనెత్తి) ప్రేయసీ!—

నీళ—ఆఁ! అదియే ప్రాణేశ్వరా! (అతనిశిరమును రెండుకరముల గ్రహించి) చూడనిమ్ము! కనులార నీమూర్తిని చూడనిమ్ము.

గోపీ—నీళా!—

నీళ—ఔను- మనసార చూడనిమ్ము. హే! పతిదేవా! నీవు దైవమవు- నేను నీ కాజన్మదాసిని- యిది భారతీయపరిణయరహస్య మఁట!- చూడనిమ్ము! ఈదీనురాలిహృదయమున దైవేచ్ఛచే- సహజముగ- కాదు- పాపదాయకముగ- భూదేవోత్తముల పవిత్రతర వేదాశీర్వచనమంత్రాక్షరవిరుద్ధముగ- జనించినయను రాగమును- తీసివైచి, చేతులార రూపుమాపి, నిర్నామ మొనర్చి- హాహా! వినుచున్నాఁడవా? పతిదేవా!- యీహృ దయమున యీలోకమునకేగాక-యుత్తరలోకముననను, ననుబా యని నీమూర్తిని ప్రతిష్ఠింపవలయు- స్థాపింపవలయు.

[ప్రవేశము: జోకాబాయి- దూరమున నీళనుచూచి నిలచును]

గోపీ—ఇదియేమి? నీళా!—

నీళ—ఇదియా? పతిభక్తి! పాతివ్రత్యము! ఇదియే ప్రపంచమున కంతయు భారతమాత చాటుచున్న పరమోత్కృష్టధర్మము- యిదియే హైందవనైవాహికమంత్రసారము-

జోకా—(జనాంతికముగ) మఱల యీనిర్భాగ్యురా లెక్కడనుండి దాపరించిందిరాబాబూ!—

నీళ—(మోకరించి- పతిపాదములఁ బట్టి) వింటివా! పతిదేవా! యీచ రణములే యీదాసికి భవాబ్ధిసంతరణకారణములు-

గోపీ—నాచరణములే? కుంభదీపికాన్యాయముననా?

నీళ—జన్మజన్మాంతరకృతపాపపరిహారణములఁట!—

జోకా—నీ మొహమఁట—

గోపీ—అబ్బో ! అంతగొప్పవేకాని- గేహేశూరన్యాయముననా ?

నీళ—అనురాగభక్తిసుధావాహినీనిలయములఁట !- (అని యంకపీఠి నుంచ చరణములు లాగును. గోపీచాను క్రిందఁబడును.)

గోపీ—అమ్మా !- అమ్మా !—

జోకా—ఆఁ- ఆఁ- వెధవపీనుగా ! యిదెక్కడివల్లకాటిభక్తియే ?

నీళ—(నిశ్చేష్టయై యిరువురిని చూచుచుండును.)

జోకా—నీకేమి దయ్యముపట్టినదా ! భూత మావేశించినదా ? (కొట్టఁబోవ)

గోపీ—(క్రిందనుండియే) జననీ ! —

జోకా—(ఆగి- గోపీచందును చూచుచు) ఆఁ- ఏమి పుత్రరత్నమా ?

గోపీ—హాం (గొంతుక సవరించుకొనుచు) నే చెప్పన దేమనిన—

జోకా—ఆఁ- నే వినున దేమనిన—

గోపీ—నీళ యేమియు తెలియని ముగ్ధ. 'భస్మచ్ఛన్నాగ్నిన్యాయము'

జోకా—నీవు సర్వమును తెలిసిన పండితుఁడవు- మూర్ఖన్యాయము—

గోపీ —అది కాదు మాతా !

జోకా— అది కాకున్న నింకేమి పుత్రకా ?

గోపీ — మఱి- యేదో- యథారాజీన్యాయమున—

జోకా—నీ మొహాంన్యాయము—మూర్ఖా ! (నీళతో) అలా చూస్తూ న్నా వేం ?—

నీళ—శాంతము. భవ్యతరప్రేమవాహినియగు దీర్ఘాక్రోధములకు తావు లేదు. పతిదేవా ! ఈదాసికి భవదీయచరణములే ముక్తిసౌధ సోపానములు—

గోపీ—కావు- కావు- దూరమున నుండుము—అమ్మా !-

జోకా—అయ్యో నాయనా ! యిదెక్కడి విలక్షణపుపెండ్లము దొరి కిందిరా బాబూ నీకు ?-

[ప్రవేశము: రామేశ్వరుండు.]

గోపీ—బాబూ ! మళ్లా తయ్యారైనారా ? మీ మేదైన మాట్లాడుకుం టూంటె సరి- తాము "హాజరు"

జోకా—గొప్పపండితులు కదా స్వామీ ! విద్యాసద్గుణాలు ఒక్క చోట యుండవా యేమి ?

రామే—అదికాదు జోకాబాయిగారూ ! మీసోదర లిపుడు తుకారామ్ చెంత క్రొత్తవిద్య నభ్యసించినది. దాని నిచ్చట యనుభవపూ ర్వకముగ నేర్చుకొనునంట !—

గోపీ—ఏమివిధ్య ? కార్యార్థిన్యాయమున అడుగుచున్నాను !

నీళ—నిర్మలప్రేమవిద్యను !

జోకా—అదేమిటి ? నీళా !

నీళ—ఔను- మాతా ! రాగద్వేషాదిదుర్గుణనిధానమై, పశుపక్షులకు సైతము సహజమగు యన్యదేశీయాంగనల తుచ్ఛేంద్రియసంజా తమగు మోహవికారము కాదు- భారతీయప్రేమ, తైలధార వోలె నిశ్చలమై నిరుపమానమై జాగ్రన్నిద్రాస్వప్నావస్థల యందును మారనక, యైహికాముష్మికముల సతీపతుల నైక్య మొనర్చి, యేగురువరేణ్యులచేకాని, యేరాజమార్తాండులచే కాని, తుదకు ముడివైవగలిగిన యావేదమంత్రములచేకాని— ఛేదింపరాని బంధమై, వివాహానంతరమున జనించి- మరణించి నను బాయని ప్రేమబంధము-

గోపీ—నిత్యమై, నిర్మలమై నిరుపమానమై, నిర్వికారమై, అబ్బా ! ఎంతపెద్దమాటలు—చిట్టాఆవర్జాలలో యివి లేవు.

జోకా—అయితే నీళా ! మళ్ళా యింటి కెందుకొచ్చావు ?

నీళ—ఆప్రేమవిద్య నిచ్చట నేర్చుకొనుటకు- యీపాఠశాలలో—

జోకా—నయమే శాబూ! నాయింటిని బడి అన్నావుకాని- యింకా సత్ర మనలేదు-

నీళ—కాదా తల్లీ! యిదియే భారతీయగృహముల యుత్కృష్టతరపూర్వాచారములని విరసింపబడుచున్న హైందవధర్మముల కావాసస్థానమైన పతిగృహమే—

సీ. తల్లికైనడి నన్నితప్పుల సైచి పు
ణ్య మొసంగు సతుల దేవాలయంబు;
వలదన్న, సద్గ్రంథపఠనకష్టము లేక
పలుశాస్త్రముల నేర్పు పాఠశాల,
శ్రమ లేక, తనయంత, సర్వంబు సమకూర్చి
యానంద మొసఁగు విహారభూమి;
పరిహాసాదులనైన నాడింపఁగల భవ్య
మహిమ చేకూర్చు సన్మంత్రశాల;

గీ. సతులయనురాగసర్వార్థసాధకంబు
కాంతసౌభాగ్యకల్యాణకల్పకంబు
ప్రణయత్యాగోపదేశవైరాగ్యశాల
పతిగృహం బెందు, సతులకు పాఠశాల.

జోకా—అమ్మ గయ్యాళీ! ఎంతచదువుచదివితివే! గడపదాటితే మళ్లా నాగుమ్మం త్రొక్కటానికి వీల్లేదని చెప్పలేదూ! ఎందుకొచ్చావు సిగ్గులేక- నడూ యీపాటికవతలికి —

నీళ—అమ్మా! గురూపదేశ మయినపిదప తండ్రియింటికి వెళ్ళిన నచ్చటను నాకు తావు లేదఁట!- యీగృహమును వీడ నాకు ఆజ్ఞ లేదు.

జోకా—ఇదిగో చీపురు ఆజ్ఞ- పోయెదవా! లేదా?—

[ప్రవేశము: రోహిదాసు మేన రక్తము స్రవించుచుండ]

జోకా—దయచేయండి బాబూ! లోపలికి దయచేయండి.

రోహి—అమ్మా!

జోకా—సందేహ మెందుకు నాయనా! శూద్రుఁడు మహాత్ముఁడై యగ్రజన్ములవారి కాచార్యుఁడైనప్పటినుండీ కడజాతివారికి కనకాభిషేకాలు జరుగుతున్నాయి- బాబూ- దేవతాగృహంలో పీట వేయమందునా!

రోహి—అమ్మా! మారంగనికి దాహమగుచున్నది.

గోపీ—అమ్మా! వాన్ని యేమీ యనకుము. వానివ్యవహారమంతా 'పయోముఖవిషకుంభ న్యాయం'

జోకా—దాహమా! దేవునికి తీర్థము కావలయునా?

రామే—అధమా! దాహమని యిలు చొచ్చెదవా! నూతికడ కేగ లేకపోతివా?

రోహి—అయ్యా! పోయితిని- కాని- యందున్నవారు నన్ను కసరి, తిట్టి పొమ్మనిరి బాలకులు రాల రువ్విరి. నదికి పోవ- కొందఱు పుణ్యాత్ములు కుక్కల నాపై ప్రేరేపించిరి

సీళ—అయ్యో! పాపము! ఎంతదారుణము? భారతదేశమున కుక్కలకున్న స్వాతంత్ర్యముసైతము సజాతీయమానవునికి లేదా! ఓయీ దీనుఁడా! ఆగుము నే నిచ్చెద నీరమును—(లోని కేగును.)

గోపీ—అమ్మా! రక్తముకూడ కారుచున్న దే!—

జోకా—ఏం- అయితే!

గోపీ—అబ్బే! చెప్పాను- అంతే- అప్రసక్తనిషేధన్యాయము!

రోహి—స్వామీ! మీకును యేదైన దెబ్బ తగిలిన రక్తము వచ్చునా?

గోపీ—రాదుమరి?—

గోహి—నిక్కమే ! అగ్రవర్ణములవారి శరీరములును నంటరానివారి శరీరములవలె రక్తమాంసములతోనే నిర్మింపఁబడినవా ?

గోపీ—ఆఁ- అర్ధజరతీన్యాయ మటరా ?

గోహి—స్వామీ ! మీరక్తము బంగరువర్ణము కలిగియుండునా ?

గోపీ— ఓరి బుద్ధిహీనుఁడా ! మారక్తమును యెఱ్ఱగా నుండును.

గోహి—అయిన నంటరానివారికిని నగ్రవర్ణములవారికిని భేద మేమి ?

గోపీ—ఇదియూ నీప్రశ్నలకు కారణము- బాగున్నది. స్వదీపచుంబన న్యాయమా !- అది నీకర్మ.

గోహి—నాకర్మ నన్ను బాధించును కాని, నన్ను తాఁకిన మిమ్ములను కూడ బాధించునా ?

[పునఃప్రవేశము:—నీళ- నీటిచెంబుతో]

నీళ—ఇదిగో నీళ్లు.

జోకా—ఇదేమి పోగాలమే ! కడజాతివారికి దాహ మిత్తువా !

నీళ—అమ్మా ! దాహముచే నాఁడు ప్రాణములు బాసిన ?

జోకా—మతీమునిచిది- ఒకఁడు కాదు వేయిమంది చండాలులు చస్తే మాత్రం మోసుతం పూర్వాచారాలకోసం ?

గోహి—అమ్మా ! చావనున్నవానికి నీరిచ్చిన మతమంతయు పోవునా?

జోకా—పోదూ మటి- మన్నుగొట్టుక మతీ పోతుంది—

నీళ—అక్కటకటా ! జగదేకజనకుఁడగు నాపరమేశ్వరునిచే సృజియింపఁబడిన, యానశ్వరస్వరూపుండగు నొక్కసజాతీయమానవ జీవితముకన్న మత మెక్కుడగునా ? అమ్మా ! మతములు- ఆచారములు- మానవకల్పితములు. మతములను- ఆచారములను మఱల కల్పింపవచ్చు కాని, అమ్మా ! ఒక్కప్రాణి తన జీవితమును బాసిన- యీలోకముననున్న మతములన్నియు

కలిసినను. ఆచారముల యావచ్ఛక్తిని వినియోగించినను, నొక్కక్షణమైన. చనినజీవితమును మఱల నొసంగఁగలవా?

గోపీ—వలదు నీళా! అమ్మమాట వినవలయు!

నీళ—భాగ్యము. పతిదేవా! ఓయీ నిర్భాగ్యుఁడా! తుకారామ్ నీమాహాత్మ్య మెఱింగిననేమి? నీకు దృఢభక్తి యున్ననేమి? నీ వంటగానివాఁడవు- నీ నాదైవముచే సృజింపఁబడలేదు- నీవు మానవుఁడవు కావు- వింటివా! నీవు తపించి చచ్చిననుసరియే నీ కిందు దాహశాంతికై గ్రుక్కెడునీటిబిందువైన లభింపదు. మా బాధల- మాహింసల భరించుటకై యీసర్వేశ్వరుఁడు—కా దెవరో క్రొత్తదైవమో- దయ్యమో మిమ్ముల సృజించియుం డవలయు—

రోహి—ఔనా! రంగా! అంతయేనా?

గోపీ—రంగా యఁట! చనటపీనుగా! ఏదో మేము భార్యాభర్తలము- 'అభావవిరక్తిన్యాయమున'- కాదు- 'మార్జాలమూషకన్యాయ మున'- అదియుకాదు- ఏదో- వెధవన్యాయమున- సరససల్లాపము లాడుచుండ- నీవు మేషయుద్ధన్యాయమున నడ్డువచ్చెదవా? నీరంగఁడు- (అని విగ్రహమును లాగి విసరిపారవేయును.)

రోహి—ఆఁ- ఆఁ- నన్ను శిక్షింపుఁడు కాని- నారంగనిమాత్రము—

జోకా—రంగఁడు- నీతల- ఒరేయి!- గెంటేయ్యండి వీనిని—

రోహి—అయ్యో! అయ్యో! రంగా! యీమాటరానితనమునకదా నీకును నాకును యెడఁబాటు గలిగె! యింత యధర్మమా!

(అనుబంధము 20.)

(నిష్క్రమము- యవనిక పడును)

---

దృశ్యము. ౨.



సమయము: ఉదయము.

[ప్రతాపఘర్ దుర్గప్రాంతము—ప్రవేశము: తుకారామ్.]

తుకా—

సీ. అనురాగసిరుల తా నలరించె నేకనుల్
జానకీప్రథమవీక్షణమునాఁడు;
వాత్సల్యలహరి తా ప్రవహించె నేకనుల్
అలవిభీషణు బ్రోచి యలరునాఁడు;
కనలున కెంజాయ తనరారె నేకనుల్
తోయధి పైనంబు తోడుగునాఁడు;
కరుణను చాటె నేకనుదోయి, యొంగిలి
పండ్లిచ్చు శబరి కాపాడునాఁడు;

గీ. అలరి యేకనుల్ గజరాజు నార్తి బాపె
నట్టికన్నులు, శ్రుతిశిరోన్యస్తమణులు
మునిజనామృతధును లీకఠినునికతన
వగను బాష్పముల్ కార్పంగవలసె నకట !

(అనుబంధము 21.)

(నిష్క్రమణము- యవనిక పడును.)



## దృశ్యము. 3.



సమయము: ఉదయము.

[ప్రతిపఘుర్ దుర్గమున- నొకవిశాలశాల- భవానివిగ్రహాము చెంత నుపవేశించి శివాజీ పూజించుచుండ మూగమున- గంగాధరరామేశ్వరు లుందురు.]

గంగా—(రామేశ్వరునితో రహాస్యముగ) భట్టుగారూ! ఏ మట్లున్నారు?

రామే—దుర్భరము! స్వామీ! 'నీకు హృదయము వేదన' యని తుకారామ్ వచించినప్పటినుండి- దేహమున దుస్సహ మగుచుండె- అంతయు మీబోధనపై యొసగ్గితిని—

గంగా—వెట్టివాఁడా! అది యెంతసేపు- ఒక్క సహస్రనామార్చనతో సరి- అదిగో పూజ అయినది- రస్తు-

శివా—శ్లో॥ కర్మణైవహిసంసిద్ధిః మాస్థితా జనకాదయః
లోకసంగ్రహ మేవాపి సపశ్య న్కర్తు మర్హసి.

గంగా—శ్లో॥ యద్య దా చరతిశ్రేష్ఠ స్తత్త దేవే తరోజనాః
సయ త్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.

(గీతా)

శివా—అదియే సమస్య! అభివాదములు బ్రాహ్మణేంద్రా! శత్రువుల స్తిమ్మములు పూలబంతులవలె చెండాడుచు వీరస్వర్గమునకు సోపానములు నిర్మింపఁజాలు కరవాలమునకును నోరరాని తావులు కలవు నిక్కము. సాదియము లేదు.

గంగా—రాజేంద్రా!—.

శివా—లేకున్న- మేము మఱల సాధించిన యీప్రతాపఘుర్ దుర్గమున నేఁబదికన్న నెక్కుడునైనికులు లేరు- కాని, స్వామీ! ఆదుర్గ

మును సాధింపవలసిన యావశ్యకత మాకు కలుగలేదు. రక్తపాతము లేక, శాంతముగ - తనయంత నాస్వర్గము మాకు దీసము య్యె !

రామే—మహాప్రభూ ! తమబలపరాక్రమములవలన—

శివా—కాదు - ద్విజేంద్రా ! దానికి కారణము మారఘుదేవు ప్రజలకు బోధించిన యుపదేశము. కరవాలము ధరించు కేల చిఱుతలుచు, సింహనాదముల నుచ్చరించునోట పాండురంగసంకీర్తనాధ్వానములు. ఔను - అతఁడిటీవల భక్తుఁడు - జ్ఞాని - అతుకారాము విరచితాభంగములనే—

[ప్రవేశము: భటుఁడు]

భటు—విజయోస్తు ! దేవా ! తుకారాముని కొనివచ్చితిమి, కాని - మార్గమధ్యమున నాతఁడు 'రంగా, రంగా' యని వెదకుచు నటునిటు పోవుచున్నాఁడు. దేవర యాజ్ఞ ?

గంగా—రంగ డెంకున్నాఁడని పిలుచుకొనివచ్చిన ?—

భటు—[శివాజీయాజ్ఞకై యొక్కక్షణము వేచి - యతఁడు మిన్నకుండుట పరికించి - మౌన మర్ధాంగీకారముగ భావించి వెడలి పోవును.]

శివా—ఏదియు సవిమర్శగ పరిశోధించినపిదపకదా నిర్ధరింపవలయు !

గంగా—నిక్కువమే కాని మహారాజ్ ! ద్రోహుల శిక్షింపక వదలిన యుపేక్షచే నాద్రోహాంకురము పెరిగి వ్రూనైన, మాన్పుట కష్టము కాదా !

శివా—సత్యమే రాజద్రోహమును - మతద్రోహమును నెందును సైపకూడదనివే.

[ప్రవేశము: తుకారామ్—సావేగముగ.]

తుకా—

శా. చోరుం డీపురి నున్నవాఁ డొకఁడు; యీశుద్ధాంతమున్ దల్లదే!
శ్రీరామామణిచిత్తచోరుఁ డతఁడే శ్రీవేదచోరుండు. త
న్నారాధించి భజించువారికమనోహంకారచోరుండు మీ
రేరున్ మూడఁగ లేదె? నేఁడెద నతం డెందుండెనో చెప్పరే?

శివా—ఆనవనీతచోరుఁ డంతసులభముగ జాన్పించునా ?

తుకా—

ఉ. ఆతఁ డసాధ్యచోరుఁడని యాత్మ నెఱుంగుము; వేదశైలమున్
దాతతచోరుఁడై విడిసి దాగిన, ధాముణి త్రవ్వి నిల్చినన్
ధాతను చేరె, బాహుఁడయి ధర్మపుబిచ్చము నెత్తఁబోయినన్
పూతమనంబున న్నతని పోవక పట్టెద భక్తిరజ్జులన్.

శివా—సంతోషము. ఉత్తమాశయము. అయ్యా! నీ వెవరు ?

తుకా— నేనా- పాండురంగభక్తుఁడను

శివా—నీవు పాండురంగభక్తుఁడవా !

తుకా—కాదు- భక్తదాసుఁడను- ఎఱుఁగను మహాత్మా! ఎంతప్రయత్న మొనర్చినను నే నెవ్వరగుటయు యిదమిద్ధముంచు నిర్ధరింపఁజాలకున్నాను. ఆర్యా! దయయుంచి, నీవే నే నెవ్వరగుటయు వచింపవా ?

శివా—బాగున్నది. నీ వెవ్వరగుటయు నీవే యెఱుఁగవా? పోవనిమ్ము- నీభార్యాపుత్రులైన నీ వెవ్వరగుటయు దెలుపరా ?

తుకా—వారివలననేకదా నాసందియ మధికమగుట! నాభార్యలు తను సేవయే నీకిహపరార్థసాధకమని యనవరతము బోధించు చుందురు. తనయులు, బాంధవులు, నను జనకుఁడనియు, కుటుంబ భారవాహకుఁడనియు భావింతురు. నాకుమాఱుఁ డొకఁ డిప్పడే

చిన్నతనమునుండి పెంచిన జననీజనకుల వీడి, గృహమును త్యజించి- యెచ్చటికో- యేటికో చనితిమి. 'నా' యనువారిలో నెవరెవ్వరితో చననున్నది. కాని చెంతనుండియు యీ 'నేను' దుర్భరదుఃఖమునుమాత్రము గైకొనఁగలిగెఁగాక!— వారిబాధయందు తుద కొకశతాంశమేని గైకొనఁజాలదయ్యె. అయ్యో! యీప్రపంచరూపసంసారమున, కామక్రోధాదిరోగముల బారినుండి రక్షించుచు, జ్ఞానవైరాగ్యాదియాహారతృష్ణలఁ దీర్చు నాజగదేకజనకునకును యీ 'నేను' యనుదానికిని గలసంబంధము నీవైన వచింపఁగలవా?

శివా—సముంజసము. నీపేరైన నెఱుంగుదువా?

తుకా—ఈజన్మమున- యీదేహమునకు కారణభూతులైనవారు లోకవ్యవహారమునకై- యీయస్థిపంజరమున కిడినపేరు తుకారామ్ మోరే!

శివా—సంతోషము- స్వామీ! యితని యపరాధ మేమి?

రా మే—దేవా! మహారాష్ట్ర రాజ్యప్రతిష్ఠాపకులై, సనాతనధర్మసంస్థాపనాచార్యులై భూమి కవతరించిన యాపరశివమూర్తియో యన నలరారు దేవరచిత్రభానుభానుమండలమండితమండలాగ్రసముద్దండభుజాదండ మెల్లెడల జాగరూకమై యుండ, యీనిందితుఁడు రాజద్రోహియై—

శివా—ఏమేమీ! బీజాపురసుల్తా నొకవంక, ఢిల్లీసార్వభౌముఁ డొకవంకను వెంటనంటి తమయక్షౌహిణీసేనాసముద్రముల ముముంచుచుండ, స్వగృహముననే యిట్టిహాలాహల ముదయించునా? కల్ల- నీవు రాజద్రోహివా?

తుకా—నేనా? ఔను- ద్రోహినే- మారాజునకు—

శివా—సత్యమా?

తుకా—ఆఁ- సత్యమే! లోకమున 'సత్యము' యనున దెంతసత్యమో యదియు నంతసత్యమే!

గంగా—మూర్ఖా! లోకమున సత్యమే లేదా!

తుకా—ద్విజేంద్రా! లోకము సత్యమా! లోకాంతరస్థితచరాచర వస్తుసముదాయము సత్యమా! లోకాలోకనదీనదతరులతాశాఖా రాప్రకీర్ణమగు నీయనంతపృథ్వీమండలము సత్యమా! అంత యేల? నీవు సత్యమా! నీ వతిప్రయాసపడి యుద్ధరింప నెంచు చున్న నీమతము 'సత్యమా'?

గంగా—అవివేకీ! మహారాజుగారి సమక్షమున నే—

తుకా— ఎవరు మహారాజు?

శివా—అయ్యా! ప్రకృత మీమహారాష్ట్రదేశము నంతయు జయించి, పరిపాలించు మహారాజును కానా నేను?

తుకా—ఔనా! నీవే వచించితివా!, హాహాహా! ఇదివఱకు నీవు మహారాజవేమో యని యించుకయైన సందియ ముండెను. దానినిసైతము నీవే తీర్చితివి. సోదరా! ఈవిశాలప్రపంచమున-యీయనంతకోటిజీవరాసులలో, ముందు మిగిలి, మెదపై చేయిడి, 'నేను- మహారాజు' నని నీవే వచించితివా! ఇతరులకు ప్రభువగుటకు మునుపు తొలుత నీకు నీవు ప్రభువగుదువా! నిన్ను చేరి బాధించు కామక్రోధాహంకారముల జయింపలేదే యన్యులను జయింపఁగలవా? పోవనిమ్ము- మహారాజువనియే యంగీకరింతును. వెనుకటిజన్మమున?

గంగా—మూఢా వెనుకటిజన్మమునను మహారాజుగారే!

తుకా— ఆఁ- మీరు చూచివచ్చితిరికాఁబోలు!- కానిండు. ఆవెనుకటి జన్మమున?

గంగా—నీతలకాయ జన్మమున—

తుకా—పోవనిండు- ఇంక రానున్న జన్మమున ?

శివా—సమంజసము- కాని- రాజద్రోహ మొనర్చితి నంటివే! యే రాజునకు ?

తుకా—మా రాజునకు- మా నాథునకు.

శివా—నీనాథుఁ డెవఁడు ?

తుకా—

మ. సిరికిన్ నాథుఁడు, సృష్టినాటకము తా చిత్రించునాథుండు, వే
దరమా మానసనాథుఁ, డాశ్రితమునీంద్రాత్మానునాథుండు, దు
స్తరసంసారనిమగ్నమానవమనోద్ధారాత్తనాథుండు, పం
డరిశ్రీనాథుఁడె నాకు నీకును మనోనాథుండు భూపాలకా!

శివా—బ్రాహ్మణా! నిదర్శనపూర్వకముగ నీమహనీయుని రాజద్రోహి యని నిరూపించుబాధ్యత నీపైఁ గలదు.

రామే—సామ్రాట్! యీనిందితుఁడు మహమ్మదీయుల నాకసము నుండి యూడిపడినట్లు జనులకు బోధించుచు, మహారాష్ట్ర జాతికే కళంక మాపాదించుచు—

తుకా—నిక్కమా! స్వామీ! ఏదీ నన్ను కనులార పరికించుచు వచింపుఁడు.

రామే—(తలవంచి) శాస్త్రవులతో యుత్తర ప్రత్యుత్తరముల—

తుకా—ద్విజచంద్రమా! తల వంచితి రేల? దాసు నేల చూడఁజాల కున్నారు? చేతులార యీదీనుని యురికంబ మెక్కించినకాని మీకు సంతసము కలుగదా?

శివా—(భటునితో) ఓరీ! నీవు పోయి- (యేదియో వచించి భటుఁడు నిష్క్రమింప) రామేశ్వరభట్! నీవు బ్రాహ్మణుఁడవేనా? ధనాశచే తోడిమనుజుని ప్రాణముల కెక్కుపెట్టితివా? హెచ్చు

రిక ! యీయపరాధమును ససాక్షికముగ, సప్రమాణముగ నిరూపింపవైతివా యురికంబమున నీపాపములకై ప్రాయశ్చిత్త మనుభవింపఁగలవు. నీకు మూఁడుదినములు గడు వొసంగితి. భటులారా ! కొనిపొం డీపాపుని—

[ప్రవేశము: సేవకుఁడు. చిఱుతలు, తంబూరలతో- సువర్ణక లశముతో- వానిని తుకారాముచెంత నుంచును] గైకొమ్ము ! భక్తశేఖరా ! అదియే సువర్ణకలశము- దానినిండ బంగరు నిష్కము లున్నవి. అవియే తంబూరయు, చిఱుతలును— గైకొమ్ము.

తుకా—నాకే. భళి ! రాజేంద్రా ! నీ విప్పుడు రాజేంద్రుఁడవనుట యంగీకరించితి నా కివ్వఁదగినదాని నిచ్చితివి. (తంబూరను చిఱుతలను గైకొని) రంగా ! రంగా ! ఏమి నీకరుణ ! (పోఁబోవ)

శివా—ఆగుము భక్తశేఖరా ! స్వీకరింపు మాబంగరుకలశమును. భక్తి పూర్వకముగ నీశివాజీ సమర్పించుచున్నాఁడు.

తుకా—వలదు. రాజేంద్రా ! ఆపెనుభూతమునకుమాత్రము న న్నప్ప గింపకుము. నే భరింపఁజాల !

శివా—పరీక్షయందు తీర్ణుఁడైతివి. బహుమానము వలదా ! అనుగ్ర హింపుము. తప్పదు.

తుకా—(అనుబంధము 22.)

శంభా—దేవా ! యితఁడు నాపొలమునందలి ధాన్యమును పశువుల కును పక్షులకును నర్పించి నాశన మొనర్చెను.

తుకా—నేనా ! కాదు సోదరా ! పాండురంగఁడు

శివా—ఆర్యా ! పాండురంగఁ డితనిధాన్యమును హరించెనా ? అయిన నితనిధాన్యము నెవ్వరిత్తురు ?

తుకా — పాండురంగఁడు !

శివా — పాండురంగఁ డిచ్చునా ? యోచించి వచింపుము.

తుకా — తప్పక ! పాండురంగఁడే !

శివా — నిక్కమా ! ఈకలియుగమున పాండురంగఁడే యిచ్చునా ?

తుకా — వెఱ్ఱివాఁడా ! దృఢభక్తి యొక్కటి యుండవలయుఁగాక, కలియుగమునమాత్రము మహాత్ములు లేరా ? పాండురంగఁడు లేఁడా ? భక్తులు లేరా ?

శివా — సరియే. కానిమ్ము. విధ్వంస మొనర్పఁబడిన యీపైరు మఱల నొక్కదినముననే, ఫలించి కోతకు సిద్ధమగునా ?

తుకా — సందియమా ?

శివా — సమంజసము. అయిన నిదియే నీపరీక్ష- కాదు హైందవమత పరీక్ష- భక్తశేఖరా ! దీన నీవు కృతార్థుఁడవైతివా లోకమున హైందవమతము నిత్యమై, నిరుపమానమై వెలుంగఁగలదు. లేకున్న- ప్రపంచమున వేదములు లేవు- ధర్మము లేదు- దైవము లేదు. ఆనాల్గవఘడియయందే నీకై సిద్ధపఱుపఁబడిన యురికంబమున నీవును లేవు హైందవమతమును లేదు. ఆయుత్తరక్షణముననే హైందవసామ్రాజ్యసంస్థాపనాబద్ధకంకణుఁడగు నీశివాజియు లేఁడు ఇదియే నీకు- నాకు- కర్మయోగమునకును- భక్తియోగమునకును పరీక్ష. ఆపాండురంగని పరీక్ష.

తుకా — (అనుబంధము 22.) (నిష్క్రమము)

శివా — భటులారా ! రేపు తొలిజామువఱకీమహానీయుఁ డెందు సంచరించినను సరియే- ఊరక వెంట నుండుఁడు. ఉదయమునమాత్ర మీతని శంభాజీపొలముచెంతకు కొనిరండు. అందే యురికంబ

మును సిద్ధము చేయుఁడు మఱచితి. రామేశ్వరభట్టును సైతము కొనిరండు.

భటు—(నిష్క్రమము)

శివా—భవానీ! అంబా! యిది నీపరీక్ష. నీకుమారు నెట్లుకాపాడెదవో! (మోకరించి- విగ్రహముచెంత) నీయదే భారము.

(యవనిక పడును.)



శ్రీ రాజరాజేశ్వర్యైనమః—శ్రీ సుబ్రహ్మణ్యాయనమః

# భక్త తుకారామ్.



## పంచమాంకము.



### దృశ్యము: ౧

సమయము- రాత్రి

[శ్మశానప్రాంతము:—ప్రవేశము: సావేగమానసయై నీళ.]

నీళ—గురురాజీ! మహాత్మా! ఎందున్నాఁడవు! అయ్యో! యిదియేమి? శ్మశానభూమి- ఔను- పతిగృహమును మనసార త్యజించిన సతు లెట్టిమణిమయమందిరములనున్నను నవి శ్మశానప్రాయములే కదా!- గురురాజీ!

[ప్రవేశము: గంగాధరుఁడు]

గంగా—ఎక్కడికి? ఎందుకు?- మఠమును వీడి యీనిశాసమయమున యిం దేమొనర్చుటకు? గంగాధరా! యింతయే! తుద కంతయు నింతయే- కర్మయోగమున కంతయు—నింత- యే- 'కర్మణై వహి సంసిద్ధిః'

[ప్రవేశము: రోహిదాసు]

(అనుబంధము 23)

రోహి—ఏఁడీ నారంగఁడు?

నీళ—ఏఁడీ నాగురువరేణ్యుఁడు?

గంగా—గురువు—తుకారామ్! రేపు సూర్యోదయానంతరము నాల్గు ఘడియలకు యురికంబమున ప్రాణముల నీడినపిదప- గురువు- తుకా-రామ్- కర్మకైవ—

నీళ—(రోహిదాసుతో) మహాత్మా! నాగురుఁ డెందున్నాఁడో వచింపుమా!

రోహి—తల్లీ! నారంగఁ డెందున్నాఁడో వచింపుమా!

నీళ—అయ్యో! నాగురువుని చేరుటకు నా కేదిదారి?

రోహి—అయ్యో! నారంగఁ డమాయకుఁడు. నిన్నటినుండి యాహార ము లేదు. అతని నెవ్వ రాదరించువారు? ఎవ్వ రన్నమిడువారు? నా కేది దారి?

గంగా—ఉన్మాదవైద్యాలయ మిద్దటికిని. మూర్ఖా! కర్మభూమియగు నీదేశము గోష్ఠమాయినదా! కడజాతివానికి- కమలాత్ముఁ డఁట!

రోహి—స్వామీ! కమలాత్ముఁడో యెవ్వరో నాకు తెలియదు. నా రంగని వదలిమాత్రము నే బ్రదుకఁజాల! మీ రేమైన నారంగని చూచితిరా?

గంగా—ఆఁ- చూచితిని

రోహి—(సంతసమున) ఎక్కడ? ఎప్పుడు?

గంగా—అదిగో! నీశిరమున—

రోహి—నాశిరమునా! నిక్కమే! హాహాహా! ఎంత వెఱ్ఱివాఁడను! రంగా! నిన్నటినుండియు నాతలయందే యున్నాఁడవా! అయ్యో! రక్తమాంసములతో నిండిన నాతలయం దెంత బాధపడుచు న్నాఁడవో! ఆఁగుము నాయనా! వెలికిఁ దీసెద. (రాతిపై శిరము బ్రద్దలుచేయఁబోవ)

నీళ—ఆఁగుము. అందు లేఁడు-

రోహి—లేఁడా! అయిన నేఁడీ! ఆఁ- రంగా!—

గీ. తప్పులున్న దండింపుము, తాళికొందు
సరికదా, కోప మింకేల, చాలు, సైఁపఁ
జాల, రాఁగదే! దాసుని సంతరింప!
గజ్జెలందెలు చిఱుకాళ్ళ ఘల్లుమనఁగ!

(నిష్క్రమము—నీళయును.)

గంగా—ధన్యుఁడవు. తుకారామ్! అదిగో! యిచ్చటికే వచ్చుచున్నాఁడు. ఏ మాతని తేజము! శారదచంద్రికఁబోలె తళతళ చాలనంబు లేక, సర్వప్రమదావిర్భవమై, సరళమై, సాంద్రమై, సార్వజనీనసంతోషదమునై, మామకహృదయమున నిదివఱకున్న మాత్సర్యాదుల మాయించి, నిర్మలప్రేమజ్యోతిని భక్తిరూపముగ మార్చుచు బలవంతమునసైన కరముల మోడ్చి జోహారోసర్చ సేయుచున్నది. ధన్యుఁడవు- కాని- 'కర్మణైవహి'

[ప్రవేశము: తుకారామ్.]

తుకా—

సీ. పిలిచిన 'నో' యంచు వెలఁది పుత్రుల వీడి
భృత్యునిగతి పరువెత్తవలయు;
తలఁచిన, పదివేసములనైన నటకుని
మాడ్కిఁ దాల్చుచు రూపు మాయవలయు;
ధ్యానింప నెఱఁగంది మానిహృద్గుహాలలో
దారతో బందివై దాఁగవలయు;
తినుమన భాగ్యమంచని యెవ్వ రేవేళ
యేమొసంగిన భుజియింపవలయు;

గీ. జాలిపడువారు లే రొక్కక్షణము హాయి
గ నిమురింపఁ గనవు; దైవ మని పాసింప

నేమిసౌఖ్యమో నాయనా! యెఱుఁగనయ్యా!
ప్రథితకరుణాంతరంగ! శ్రీపాండురంగ!

యిదియేమి? (మోకరించి- యెముకను గాంచి)

గంగా—తుకారామ్! అదియేమి?

తుకా—అభివాదనములు! యిదియా యెముక! కాయ మగ్నిపాలైన వేళ తనచర్మవస్త్రాచ్ఛాదనముఁ బోలంగి- శాంధవ్యులకరముల సంచయన మందఁజాలక- మాటాడించువారు లేక- భూశయన మొనర్చిన యస్థిరాజము! స్వామీ! బ్రతికియున్నవేళ నిది యేప్రాణిదేహ మలంకరించియుండెనో?

గంగా—ఆఁ- నినుఁబోలు పిచ్చివానిదై యుండవలయు.

తుకా—(తల యూపుచు) ప్రకృతి నిది యెంతజూగుప్సాకరముగ నున్నది. ఇది యేసుందరీతిలకరాకాసుధాకరబింబమును మోరు నాననాబ్జము నలంకరించి విటహృదయభేదకాపాంగవీక్షణమాలికాపరంపరల ప్రసరించెనో మీ రేమైన నూహింపఁగలరా?

గంగా—అగుఁగాక- అయిన—

తుకా—లేక నిది యేభూసురోత్తమునిగళమునునో—

గంగా—ఛీ. ఛీ- మూర్ఖా!

తుకా—నిక్కమే! అంతయే- ద్విజచంద్రమా! మీరును నింతయే! నేనును నింతయే! అందఱును నింతయే- బ్రాహ్మణుఁడగుఁగాక- పంచముఁడగుఁగాక- మహితమండలేశ్వరుఁడగుఁగాక పిడికెడన్నము లేని బీదయగుఁగాక- యింతయే- ఆశాపూరితహృదయమున నీప్రపంచమెల్ల భ్రమింగఁజూచుప్రాణి యేయసువు లించుక బాయ మూడడుగులమేర కేని చాలఁడు. ఇదియే భ్రాంతిరహస్యము ఇదియే జీవితమాయానాటకమునందలి ప్రధానరహస్యము.

గంగా—నిక్కువమే- కాని—

తుకా—ఇది తరుణీమణీవదనేంగుమండలాలంకృతాస్తిరాజము కాదు- ఇది యేపరమసుజ్ఞానికంతసీమనో యలంకరించి లోకాద్ధరణము సకై యొనర్చిన నిరంతరజ్ఞానోపదేశమున వినువారిని పవిత్రులం జేసి తానును పవిత్రమై యుండవలయు.

గంగా—(ఆశ్చర్యమున) ఏల ?

తుకా—కాకున్న నిప్పుడును చెప్పకయే మనకు జ్ఞానోపదేశము చేయునా ! [ప్రవేశము: జిజియా]

జిజి—నాథా ! నాథా ! మహాదేవుఁడును, రుక్మయు—

తుకా—మరణించితిరా ! సంతోషము !

[ప్రవేశము: శివాజీ]

జిజి—మరణించిరన్న సంతోషమా ! తుదకు నేనుకూడ—

తుకా—మరణింతువా ! మఱియు సంతోషము. బంధము లొక్కటొక్కటిగ వీడుటకు సంతసించుటకుమారు దుఃఖింపుమందువా ?

జిజి—వానికి సంస్కారము ?

తుకా—ఔను- రమ్ము- అగ్ని కర్పించి కృతకృత్యులగుదుము.

(జిజియా- తుకారాములు నిష్క్రమము.)

శివా—ధన్యవు ! భరతమాతా ! భోగార్హవస్తునిర్మాణకౌశల్యమునం గాకున్నను, నీపుత్రు లాధ్యాత్మికాదర్శముల ప్రపంచమున నగ్రస్థాన మలంకరింపంగలరు ! చూడుము బ్రాహ్మణోత్రా ! రేపు ప్రాతఃకాలమునకు పొలము ఫలించుటొండె- ప్రాణములు పోవుటొండె యనుకఠినశాసనము శిరమున నున్నను, భార్యాపుత్రుల నగ్ని కర్పించి- నిర్వికారుండై- నిశ్చంచలుండై- యానందైకమూర్తియై- నృత్యము చేయుచున్నాఁడు. ఈదృశ్యము

నేకనీరస్రువైడైన వర్ణింపఁగలండా! ఏచిత్రకారుఁడైన చిత్రింపఁగలండా?

గంగా—కర్మసైవహి- మహారాజా!

శివా—ఆఁ- ఔను. కిరీటము నామస్తకమున నున్నది. కాని- భార్యాపుత్రులదహానసమయమున యాభాగవతవర్యునకు కలిగిన యనిర్వచనీయానందమున నొక్క-శతాంశమేని యీకిరీటధారణచే నాకుకలుఁగుచున్నదా? భళి! వేయిశతఘ్నులైనను నొక్క-యాత్మత్యాగి ప్రేమపూరితహృదయమును భేదింపఁగలవా?

[ప్రవేశము: తుకారామ్ సావేగముగ- జిజియూనో]

తుకా—

శా. ఏఁడీ మామకదైవదైవము సఖుఁ డేఁడీ? మనహోల్లాసియై
యేఁడీ? నాహృదయేశుఁ డెందు చనెనో? యెవ్వారిచేఁ జిక్కె-నో?
లేఁ డీతావున పాండురంగఁ డకటా! లేఁ డాతఁ డేగె?- కంటినే?
రాఁడే? ప్రాణము బాయనున్న యిదె చేరన్ బోను సచ్చోటికిన్!

జిజి—(పట్టుకొని) నాథా! నాథా! యెచ్చటికి?

తుకా—రంగా! రంగా! చిక్కి-తివా! (జిజియూను పట్టుకొని)

జిజి—ఇదియేమి?

తుకా—రంగా! పరమపదసంగా! నానాభవవిభంగా!

శివా—ఆనందము.

తుకా—సనకసనందనాదియోగిహృదయాంతరంగా! కస్తూరికాలేపిత లోకమోహనసనునోహరాంగా!

జిజి—నాథా! మాటాడరా?

తుకా—నవ్యతరశేషాహితల్పభాసమానసమానసవసవ జలధరలీలచిదాలోలకాలకాలపరమమంగళాంగా!

శినా—సాధుము భక్తశేఖరా! రేపు యుద్ధరంగమున నెక్కువలజకును చాలింపకుము. సాధుము. భవదీయముఖవినిసృతాభంగనినానములే, మావిజయనినాదముల మీఱి, భారతీయుల హృదయాగారముల భేదించి, నేను కరవాలహస్తుడనై- సమరవిజయసహస్రముల స్థాపింపజాలని సుస్థిరప్రేమరాజ్యము నొక్కనిమేసమున స్థాపించుచున్నావు. సాధుము- నీయభంగములయందలి యక్షరగళత్కాంశమున కున్నశక్తియేని నాయక్షౌహిణీసేవలకు కలదా?

తుకా—నూత్న కౌస్తుభరత్న రారంజిత కాంతినిశాంతసుకాంత నీలనీరదసమాకారా! చిక్కితివి- ఇక వదలను.

జిజి—నాథా!—నేను జిజియాను కానా?

తుకా—నీనా- జిజియా! వారంగని నాకు చూపుమా! నడువజాల! ఆయాసముగ నున్నది

(అనుబంధము 24.)

యవనిక పడును.

దృశ్యము ౨.

సమయము: ఉషస్సు.

[దేహూగ్రామము: యింద్రాణీనదీతీరమందలి శంభాజీశాలము. ఒకవైపు పాండు
రంగాలయము కాన్పించుచుండును. వేదికపై యురికంబము. స్తంభమున
శిరముంచి తుకారామ్- ఇంచుకదూరమున సాయుధుఁడగు తలవరి-
భర్తసమీపమున జిజియా- ఒకవైపు శివాజీ—భటులు- రెండవ
వైపు రెండుచేతులపై శిరముంచి- సంశయాకులితచిత్తుఁడై
యుపవేశించి గంగాధరుఁడు- యిటునటు పచారు
చేయుచు, డోలాందోళితమానసునిబోలె
శంభాజియు నుందురు.]

శివా—సూర్యోదయానంతరము- నాల్గుఘడియలకు- తుకారామున కురిశిక్ష. రామేశ్వరభట్! ఏఁడీ?

భటు—దేవా! నిన్నటినుండియు కాన్పించుట లేదు.

శివా—ప్రాణభీతి- పలాయనుఁ డయ్యెఁ గాఁబోలు! బ్రాహ్మణుఁడు- కానిమ్ము!

[ప్రవేశము: నీళ- సావేగముగ.]

నీళ—గురువర్యా! ఏఁడీ?

శంభా—(తటాలున నాగి- గంగాధరుని భుజముపై కరమిడును.)

గంగా—నిక్కముగ నేఁడు నాకు పరాభవమే యగునా? ఈవిషమ పరీక్షాముహూర్తము సమీపించుకొలఁదిని నామానసమున నారాట మంతకంతకును నధికమగుచున్నది.

శంభా—పంతులుగారూ! నే నిఁక భరింపఁజాల! ఏమైనను కానిండు. పోయినది నాధాన్యమేకదా! దాన నాకుటుంబమంతయు నశించినను సరియే- ఆమహానీయుని మృతికిమాత్రము నే సైపఁజాల.

గంగా—మూర్ఖా! నేఁడు తుకారామునకు గంగాధరుఁడైన దాసుఁడు కావలయు—లేకున్న- కర్మనైవహీ- ?

(తలయూచుచు నిష్క్రమము)

శంభా—మహారాజా! చూచితిరా! శాంతములైనను మనహృదయముల నిర్దహించుచున్న యీమహాభాగుని ప్రేమవీక్షణముల! చాల- నేభరింపఁజాల- వేఁడికొందును- దేవా! ఈమహాత్ముని క్షమింపరా! నాయపరాధారోపణ మసత్యము. నన్ను శిక్షింపుఁడు.

శివా—కాదు- శంభాజీ! కాఁజాలదు. మీఱినది. మించిపోయినది.

జిజి—రాజేంద్రా! నే నిపుడు పుత్రహీనను- దీనను; నా కిపుడు సౌమంగల్య మొక్కటియే కలదు. దానినిసైతము హరింతువా! అయ్యో! యిట్టివిషమపరీక్ష యెందైన కలదా! ఈకలికాలమున నొక్కనిమేషమున- పాలమంతయు పండి కోతకు సిద్ధ మగునా?

శివా—కావలయు. కాకున్న నాభక్తవర్యున కీలోకమున తావు లేదు.

జిజి—దేవా! నాప్రాణములఁ గొని—

శివా—చేలా! ఆత్మార్పణచే నాభాగవతోత్తముని ప్రాణములు రక్షింపఁబడు నేని- నీ వొక్కతె వేల- నేను- తుద కీమహారాష్ట్రదేశమందలి యీబాలగోపాలము ప్రాణముల పరమసంతోషమున బలి యొసంగుచుంటిని. కాదు- కాఁజాలదు. ప్రకృత మీమహనీయుని ప్రాణములు నాయధీనమున నున్నవని తలంచితివా! నీపతిప్రాణములపై లోకమున శ్రీపాండురంగఁడు కలఁడా లేఁడా యనువిషయ మాధారపడి యున్నది. భవ్యతరహైందవమత యాథార్థ్యమే యాధారపడి యున్నది. తెలిసితివా? ఈపరీక్ష నాకును నీపతికినిమాత్రము కాదు. హైందవమతమునకును, బౌద్ధచార్వాకాదినాస్తిక మతములకునుసైతము పరీక్ష. అదు

గుము. నీపతినే ప్రశ్నింపుము. అతఁడు వలదన్న- యీపరీక్ష మాని- నేనును నాప్రయత్నమును మానెద—

జిజి—నాథా!- నాథా!—

తుకా— (తల యెత్తి- తల యూపుచు- చేతులు మోడ్చి)

సీ. అరకిన్క కెంపుతో నాఁగాదుసత్కృపా
పాంగసంగతకాంతి పదను మిపఁగ
సత్వరగతి మాలి చలియించుపెన్నెట
మారిహాసైక్యప్రభ నాదరింప
శ్రమ తోయబిందు లురంబు శ్రీవలిదితో
మౌక్తికభ్రమలు నెమ్మగి కొనంగ
కరువలిసుతుగాంచు కారుణ్యాయటనచే
కలితమౌ భక్తవత్సలతఁ చెలఁగు,

గీ. చిఱునగవుతోడ సమ్మోహనా సిరులనీను
మోము భక్తకల్పక మాచు ముదముఁబెంప
నీదు కల్యాణమూర్తితో నేగుదెమ్ము
మాని హృదయాంతరంగ శ్రీపాండురంగ!

నాల్గుఘడియలు- మానవజీవితపరిమితి యని నీ వేపరిమాణమును లిఖించితివో దాన శతాంశ మేని లేక- నాల్గుఘడియలు- ససాక్షికముగ, సప్రమాణముగ- నీవో- నేనో నిత్యమనుట నిర్ధారితము కావలయు- నాల్గుఘడియలు- రంగా! ఇది పరీక్షకులయాజ్ఞ! సహస్రశీర్షుఁడవై యోచించి, గుణహీనుఁడనియు, నామరూపములు లేని యనామకుఁడనియు, తప్పించుకొనఁజూతువు కాఁబోలు. ఈపరీక్షకులయెదుట నీయాటలు సాగిరావు. నీవు నిర్గుణుఁడవైనను, సర్వసద్గుణముల నలంకరించి నీకు నామరూపంబుల నిత్తురు. రమ్ము- నాల్గుఘడియలు- (ఘంటానినా

దము. వ్యవధి నిఘడియలని సూచించుచు) కాదప్పుడే యొక్క ఘడియ గడచెనయె! చూచితివా యాపాలమును. అదియే ఫలించి యీక్షణమే కోతకు సిద్ధము కావలయు. వ్యవధి-మూడుఘడియలు—(అనుబంధము. 25)

[ప్రవేశము: గోపీ- జోకాబాయి.]

గోపీ—అమ్మా! నీ చెప్పిన పనుము. భార్యాభర్తలకుఁగల సంబంధము మాత్రము చంద్రచంద్రికాన్యాయము కాదంటివా—నీరనీర న్యాయముమాత్రము తప్పదు.

జోకా—అది కాదురా గోపీ—

గోపీ—కానున్న నేమంటావు? తేజస్తిమిరన్యాయమా? లేక గృహదీపికాన్యాయమా!

నీళి—పతి దేవాయనమః!

జోకా—నీళా! నీ పలుకు వినినదాది నాతప్పు నెఱిఁగితి- మీరు భార్యాభర్తలు—

శంభా—రామచంద్రా! మీరు ధర్మమూర్తులు. నాకతనగదా యిట్టియ సర్వము వాటిల్లె- వేడికొందును—

శివా—వలదు- శంభూజీ!- వేఁడవలదు. వెఱ్ఱివాఁడా! ఆ భాగవతశేఖరుని రక్షించుటకును శిక్షించుటకును నేను కర్తయని తలంచితివా! వేదిరాదియు నేఁడొక యననుభూతాపూర్వాద్భుత మనోహరదృశ్య మీరంగస్థలమున ప్రదర్శింపఁబడనున్నది. సులోక కర్తగనాటకరచయిత- బ్రాహ్మణోత్తమా! సర్వమతసారస్వరూపి- సకలనిగమాగమతంత్రఫలభూతుఁడు—పండితసుబ్రహ్మణ్యస్వరూపి యగుబగన్నాటకసూత్రధారి—నటకుఁడన్ననో. దుర్గమమగు కర్మయోగమును, సులభసాధ్యమగు భక్తి

యోగమున సమన్వయ మొనర్చిన మహాతేజోమయరాశి—నేడు హైందవమతచారిత్రమున సువర్ణాక్షరముల నాయక్షురనిచే ధర్మవేదబ్రాహ్మణమతములు లోకాతీతమహిమచే విరాజిల్లుట లిఖింపఁబడుటయో లేకున్న లోకమతచారిత్రమునుండి హైందవమతవర్ణనాపత్రముల చించి, నూపుమాపి యగ్ని కర్పించుటయో ప్రవర్తిల్లనున్నది. ఆలకింపుము- సుముహూర్తము సమీపించుచున్నది.

తుకా—

ఉ. రంగఁడె! పాండురంగ! యభిరామబలీశశిరఃప్రసూన, సంగ సురాజరాజసఖ రంజిత భక్తిసుధాప్రసార, సద్యోగ మొసంగ రంగఁడె! భయోరుభవార్ణవమగ్ను నన్ను శ్రీరాగనిధాన! పెంప నిటు రంగఁడె! బ్రోవఁగదే, కృపాత్మకా!

చాల ధర్మస్వరూపుఁడవు రంగా! తొలుత నన్ను పరాధియని యధిక్షేపించుటకన్న నీధర్మమును నీవు పాలించితి వేమో యోచించుకొనుము. తెలియకున్న భక్తుల నడుగుము. ఇంకను సందియమైన నీతొలిపల్కుల విస్మరింపుము- దాసుని ప్రతిజ్ఞాపాలన మొనరింపుము. ఏమందువు? దుస్సాధ్యమా? ఆఱుమాసముల వఱకును ఫలింపని పైరు సద్యస్కాలముననే ఫలింపఁజేయుట దుస్సాధ్యమనియా? నవ్వెదరు- హాహాహా! రంగా! నేత్రనిమీలనమాత్రమున జగజ్జాలముల సృజియించి మాయింపఁజాలు నీ కిది దుస్సాధ్యమనిన నందఱును నవ్వెదరు.

(అనుబంధము- 25 లోనిచరణము.)

[ప్రవేశము: శీఘ్రయానమున గంగాధరపంత్]

గంగా—అపాయము—అపాయము—మహారాజ్! శాత్రవసైన్యము లెల్లో తమయునికి నరసి యతివేగముగ వచ్చుచున్నవి.

శివా—మీాటినది—భక్తిప్రవాహ మప్పుడే యధీనత మీాఱి, యాటంకముల సరకుగొనక, తల్లిక్రైవడి, వారు, వీరనుభేద మరయక ప్రవహించుచున్నది! అదిగో వినుము! ఆపవిత్రముఖపద్మము నుండి వెలివడుచున్న కీర్తనామృతధారను గ్రోలుము.

తుకా—(అనుబంధము- 25 లోనిచరణము.)

గంగా—మహారాజ్! మహారాజ్!

శివా—ఎవరు మహారాజు! నేనా- కాను- నేను మహారాజను కాను—యిదియే కిరీటము. యిదియే కరవాలము (తుకారాముచెంత మోకరించి) వీఁడును మీారు రాజద్రోహియని నిందించిన యీాకపటవంచకవేషధారికి- దాసుఁడు.

గంగా—అక్కటకటా! మా కేదిదారి? మాయవివేకముచే పూజ్యతరమహారాష్ట్రరాజ్యమునకే వినాశ ముప్పతిల్లుఁగదా! రాజేంద్రా! వేఁడికొందును. మే మున్నను, చన్నను నొక్కటియే! మీారు సురక్షితస్థానమును చేరినపిదప మీాయిష్టమువచ్చినరీతి శిక్షింతురఁట. తొలుత నిందుండి వెడలుఁడు. మీామనుగడ భారతదేశమాతయొక్క మనుగడ!

శివా—భీతియేల? ద్విజసత్తమా! సనాతనధర్మప్రతిష్ఠాపనాచార్యులగు మీారుండ, పాండురంగాలయముచెంత భీతి కలదా?

గంగా—దేవా! పాండురంగఁడు మి మ్మిప్పుడు రక్షించునా?

శివా—చాలఁడా! పాండురంగడే లేఁడా? అయిన పావనతరహైందవమతమే లేదు- తదీయోద్ధారణదీక్షాబద్ధకంకణుఁడైన శివాజీయు లేఁడు. ఇదియే హైందవమతపరీక్షాసుముహూర్తము. ద్విజేంద్రా! పఠింపుఁడు మీామంత్రములనెల్ల! ప్రయోగింపుఁడు సనాతనాచారశస్త్రముల! అవలంబింపుఁడు యజ్ఞతపస్సమాది కర్మయోగశరముల! శిక్షింపుఁడు శత్రునికాయములతో నా

రాజద్రోహిని. లేదా—ఆశూద్రమహాత్ముని వేడుచుదు! ఆమహాత్ముని యాజ్ఞయగువఱ కిచ్చటినుండి యొకయడుగైన కదలను.

[ఘంటానాదము; రెండుఘడియలు- దూరమున దీన్ దీన్ శబ్దములు.]

శంభా—బ్రాహ్మణా! యిదియంతయు నీతంత్రమే! మహారాజును రక్షించుభారము నీపైది.

తుకా—ఔను- నిక్కువమే!

గీ. జీవతతికెల్ల జనకుండ వీవె, పాని
లో నధముండ నేను, నిక్కంబు, కాని, రంగ!
తనయుం డపరాధియే యైన దండనమున
వాని దిద్దికొనుటె తండ్రిపనియు కాదె?

నేను భవదీయమాయానాటకకర్తృపాత్రసన్నద్ధప్రతినిధను కానా! నామృతికై భీతిల్లి నిన్ను వేడుచున్నానని తలంచితివా! వెఱ్ఱి వాండా! నామృతికై నే నానంతయు చింతిల్లను కర్మబంధములం దొలంగించి, దేహమను చెఱసాలనుండి విముక్తి నొసంగుటచే నీకన్న మృత్యువే నా కిపుడు పరమబంధువు. కాని, నీకై చింతిల్లెద. రంగా! యీవిషమపరీక్షయం దుత్తీర్ణుండవు కాంజాలకున్న లోకమున భవదీయాశ్రితులకెల్ల భక్తి నశించునేమో యని చింతిల్లెద—

[అనుబంధము 25 లోనిచరణము. ప్రవేశము: సైనికులు- రామేశ్వరునితో- 'దీన్ దీన్' శబ్దముల]

సేనాని—బోలో- బోలో! కోనుహై శివాజీసర్కార్!

శంభా—కానిమ్ము! జపము తీవ్రముగ కానిమ్ము.

సైని—ఆరే- ఉఠోభై—(గంగాధరుని) బోలో- (రామేశ్వరుని)

శివా—వలదు- ఆబ్రాహ్మణుని బాధింపవలదు. నేనే శివాజీ—

గంగా—మహారాజా! యిదియేమి?

శివా—ఇదియా బ్రాహ్మణరక్షణధర్మదీక్ష! భక్తిజ్ఞానకర్మసమ్మేళనము-స్వామీ! యీశివాజీజీవితముఖ్యోద్దేశరహస్యము నే మెఱుంగరా! శివాజీ భోగలాలసుఁడు కాఁడు. రాజ్యకాంక్షచే యీ మహోద్యమమునకు పూనినవాఁడు కాఁడు. గోబ్రాహ్మణరక్షణమే శివాజీదీక్ష. అట్టిచో ప్రత్యక్షమున ప్రవర్తిల్లుచున్న బ్రాహ్మణహింసను జూచి యూరకుండఁగలఁడా?

శంభా—దేవా! యితఁడు బ్రాహ్మణుఁడా? గోముఖవ్యాఘ్రము మగుఁగాక!

శివా—అతఁడు కాఁడు, శంభాజీ! యాతనిబ్రాహ్మణత్వము నాచే రక్షణీయము. వ్యక్తిగతదోషముల పాటించి, హైందవమతము నకే నూతనశోభ నొసంగిన బ్రాహ్మణత్వమును, బ్రాహ్మణులను దూషింతువా! భటులారా! ఒక్కఘడియ యాగుఁడు—

సేనా—ఘడియ-ఘడియ నై-బందో—

శివా—అధములారా! అయిన నిదే—

గంగా—తుకారామ్! మహారాజు నిప్పుడు రక్షించితివా నీచరణసేవ కుఁడ నయ్యెద!

తుకా—ఆఁ-బంధింతువా! రంగా!

సీ. ఉపనిషద్గుహాలలో నున్న నిన్ భక్తిశృం
ఖలముల బంధించి గ్రాలుచుండ,
కందర్పకోటిసంకాశమౌ మూర్తి నా
హృదయమున్ చెఱసాల నిమిడియుండ,
సుందరేందీవరామందమౌ కనుదోయి
నాకనులలోఁ జిక్కి నవయుచుండ,
నీయిల్లు నీసతి నేఁ బాపి, హింసించి
యణువు నణువు జేసి యాలరుచుండ,

గీ. నీవా ? నేనా బందిఁడుగుట నీకుభక్తు
లె తెలుపరె ? చిక్కితి- కదలలేవు రంగ !
భక్తిధన మిచ్చి కొంటి నీస్వామి నేను,
బంటు వీవు ! ర మ్మిదె భక్తవరులయాన !

తు. సై—హా- హా- అల్లా ! అదిగో శివాజీ ! బందో- (పలాయితు లగుదురు.)

రంగా—మాయ ! తురుష్కసైనికులు పలాయితు లగుచున్నారు ! స్వామీ ! దాసోహం ! అపరాధిని !

రామే—హా ! దుర్భరము ! హృదయశూల ! మహాత్మా ! రక్షింపుము. దుర్భరము.

శివా—చూచితిరా ! అభక్తవర్యుని మహిమ ! ద్రోహమునకు ప్రపంచమున ప్రతిఫలము తప్పదు. మీకెన్నఁ డీభాగవతశేఖరునియెడ నిర్మలభక్తి యుదయించునో యానాఁడే- యాక్షణముననే యీహృదయశూల మిముఁ బాయఁగలదు.

[ప్రవేశము: రోహిదాసు.]

రోహి—రంగా ! ఎందున్నాఁడవు-వచ్చితివా ! రమ్మి ! నాయనా ! పరువెత్తకుము ! తప్పుసుమా ! పడుదువేమో ! పిదప నిన్నాదరించువా రెవరు ? (ఆలయమును ప్రవేశింపఁబోవ.)

రంగా—ఆగుము- పంచముఁడవై పాండురంగాలయములోపలికి వచ్చుచున్నావా !

శివా—స్వామీ ! ఆభక్తవర్యు నిరోధింపకుఁడు. భక్తిబృందావనమున జాతిమతవివక్షతలకు తావు కలదా! అదిగో ఆలకింపుఁడు. మఱల తరుణము లభింపదు.

తుకా— (అనుబంధము 25 లోనిచరణము.)

గోపి.— అదిగో రంగఁడు—యిందును రంగఁడే—ఎందుచూచినను రంగఁడే— దేవాలయమునమాత్రము గాక యొందుఁజూచినను యున్నాఁడవా! ఆహా! రంగా!—(వేదికపై శిరముంచి పరుండును.)

స్తంభా.— భళి- భళి! పాలము సంపూర్ణముగ ఫలించినది.

గంగా.— ఆహా! ఇంద్రాణీనదీజలములయందు తుకారామకృతాభంగము లెట్లుప్రకాశించుచున్నవి!

తుకా.—శ్రీలలనావామాంకవిలసితమై, వేదాంతపల్లవసముల్లసితమై, బ్రహ్మాదిదేవతానుర్భాన్యమై, నారదాంబరీషాదియోగిహృదయారవిందవిద్యోదితమై, నీలనీరదశ్యామలకోమలఁదుర్నిరీక్ష్య, దుర్లక్ష్యప్రభాభాసితమైన త్వదీయభద్రంకరమూర్తిని— భవదీయాంఘ్రినీరేజాతములను వదలను... లేదు- నానారూపక్లేశప్రాపంచికమోహము—లేదు- లీలాలాలితవిషయజాలామహాన్మాదము—ఆహా! సత్యాద్వైతశుద్ధబుద్ధచైతన్యమే— ఆ-నంద- మే- ఆనంద- నిత్యానందమే—(తూలుచు) ఇందిరానందనిర్వికారానందా! నందనందనా! పండరిపురీనందనా! నిర్గుణానందా! (ఆయాసమున) హా- హా- (స్తంభమును చేతితో తడుముచు) ఇది- వన- మాల- యిది- నిస్తులప్రశస్త- కౌస్తు-భము- యి- దే- రంగఁ- డు- రంగతరంగ- తేజోత్తుంగ-సర్వజ- గద్రంగమున- రం- గఁ- డు- హా- లీల- శ్రీ- లీ- ల-జ్ఞా- న- లీ- ల- రంగ-

[ఉరికంబము పాండురంగ విగ్రహమగును.
ప్రత్యక్షము పాండురంగఁడు.]

పాండు.—"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజా మ్యహం॥

పరిత్రాణాయ చ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥ "

(భగవద్గీత.)

[పొలము ఫలించును- దేవాలయము తలుపులు తమంతట తెఱువఁబడును. జయజయధ్వానములు- పుష్పవృష్టి- నదీనీరమున వేయఁబడిన యభంగములు నీటిపై తేలి ప్రపంచమంతయు వ్యాపించును- విమాన మాకసమునుండి దిగుచుండుట కానఁనగును.]

మంగళము.



# అనుబంధములు.



## ప్రార్థన.

శ్రీ - రమాదేవ - మాధవా॥ శ్రీ॥

శ్రీరమా - వినుతచరణ - సురవందిత - రమేశ - జయ
హే - యదునందన - రమా - దేవ - మాధవా - జయ॥ శ్రీర॥

పాహి పాహి - పీతాంబరధర హే - లలితకళాదర్శమండలి
భోగభాగ్య శ్రీ - సంతతశుభదా నమోస్తుతే
రమా - దేవ - మాధవా॥ శ్రీర॥

జిజి—హిందోళ రాగము—ఖండగతితాళము.

1. కావరమా- కనులకు నైకముగప్పె నింత॥ కావ॥
ఏవరును- లేరని- తలచితో ?- యడుగగ- నీయెడ॥ కావ॥

ఒడలెఱుంగవా - వంటకైన సాయపడవు - బడుగుబోలె
పడియుందువింట జన్మరోగి - తిండికైన సిద్ధమగుదె - జడమతి॥

2. తుకారామ్—కేదార రాగము—ఆదితాళము.

పాలయగోకుల బాలా - లీలాలాలితమానివిలోలా - మాం॥ పాల॥

ఖేలాలోలుప - హేవనమాలీ ! శ్రీలలనాహ్లాదిలోలా
బాలా - లాలితమానివిలోలా - మాం॥ పాల॥

రంగశుభాంగ - సంగవిభంగ - ధృతసుపదాంగుళి
గంగా - రంగా - మంగళప్రేమతరంగా మాం॥ పాల॥

3. జిజియా—కాపీ రాగము—ధృపద తాళము.

అలసితో - కులుకుచు - విభునితో - పలుకగా
నిలచిన - బ్రదుకవిక - నీచమతి - నీరమును - తేగదవె॥ అల॥
(పతితో) నీ వికనుచనుమా - నీసతితో - సరసము చాలును। నీవి॥
ఎటుల - తేగలవ్రుధసము - నీ - పీగతిన్ - మసలినన్॥ నీవిక॥ అల॥
(మహాదేవునితో) హింసించెగా - కటా - జనకుఁడే
అదయుఁడై॥ అలసితో॥

4. రోహి—సారంగ రాగము—ఆదితాళము.

పతితుఁడవైతే - పాండురంగా॥ పతి॥
అతినీచుఁడ నా - నను తాకుట -॥ పతి॥
నీగతి నేరా - నినుదలపరురా - ఎగురుచుపాడుచు
ననువీడకురా - పొగడరు - పూజింపరురా॥ పతి॥

5. తుకారామ్—యమన్ రాగము—ఆదితాళము.

మాయామేమోగా - రంగా - నీ॥ మాయా॥
సతి సుతులని తా - మతిదలచెదరే - అతిమూఢతయే
గతినిను గొలుతురు॥ మాయా॥

6. జోకాబాయి—ఆనందభైరవి—చాపుమిశ్రలఘుతాళము.

ఇంటికిరా - వెందుకు పై - కుంఠపతి వైనందుకా - మా॥ యింటి॥
చిన్నతనమున - నిను యశోదా - మన్ను తిన్నావని యన
సన్నుతంబుగ నోట జగము - లన్నిఁ జూపిన వెన్నుఁడా - నా॥ ఇంటి॥
ఒంటిగా విడిచనెను నాపతి - జంటలేరీ యింట నాకిక
వెంటబోయక విసురుని - యింటికి చనినట్లుగా - నా॥ యింటి॥

7. నీళ—హిందుస్తానీ భైరవిరాగము—ఆదితాళము.

స్వాతంత్ర్యమె లేదా - స్త్రీ - జాతికి॥ స్వాతం॥

సతులకు పరిణయ మీతీరుమారెనే - పతిగృహమున తా
పరిచారమునకా॥ స్వాతం॥

భారతదేశాంగనలకు - భాషాపఠనంబు వలదె - పూర్వా
చారములనుచును పౌలతుల పాటింపకున్న - పరతంత్రం బెటు
బాయును - ధరణిని నభ్యుదయం బెటు - లేరా యిలసంఘ
సంస్కర్తలు - మూకిక - నేగతి॥ స్వాతం॥

8. తుకారామ్—లలితరాగము—ఆదితాళము.

దయరాదా - రాధా - నాథా॥ దయ॥

ధనవిభవంబుల - నే - నడిగితినా॥ దయ॥

మోక్షదాతవని నీబిరుదేగా - రాక్షసాంతకా రాగదె
బ్రోవా - మఱపేలా - మామనోహరా॥ దయ॥

9. నీళ—మాల్కోస్ రాగము—ఆదితాళము.

పూజింతున్ భవ - దీయచరణముల -॥ పూ॥

ఏమినోముం నే నోచితినిటునా - ప్రేమకల్మి
భామా - సుమశర॥ పూ॥

10. తుకారామ్—అసావేరి రాగము—ఆదితాళము.

గుణనిధాన - నను ప్రాణదాన - మె - కోరిన -
కొనుము మంగళమా - పతిద్రోహము - అబలా - హే
యముకాదె - ఏలా - యీ - భవసంసేచన ఓ - గుణ॥

భర్తృసేవకదా - జాయావ్రతమా - ప్రేమోదధిలో
కలదే యీకలుషము- యిదియే పరిణయ
మంత్రరహస్యము॥ గుణ॥

11. స్త్రీలు—బేహాగ్ రాగము—ఆదితాళము.

హారతిగొనుమా - ముదమారా - వీర
శూరగం - భీరసుధీర॥ హార॥
సంగరరంగమునందు జయంబు - పాండురంగ
కృప నొందుము వేగ॥ హార॥

12. శివాజీ — సేన—మోహన రాగము—ఆదితాళము.

జయ్‌భవానీ - జయ్‌మరాఠా సుధీర - మాతా॥ జయ్॥
యుద్ధజయంబె - శుద్ధయశంబె - 'హరహర
శ్రీమహదేవ్' - భవానీ॥ జయ్॥
భేరీ - ఢంకా - ఝాంకృతులుండ - ఢాలు - కఠా
రిపుతతిచెండ - ధరింపజేసెద - ధరనాజెండా - రక్తము
భూమిని - ప్రవహింపంగా - మృత్యుమృ
దంగధ్వనులు చెలంగ॥ జయ్॥

13. రోహి—చాఘవ రాగము—ఆదితాళము.

పాడెద - జోయని - పాండురంగా - నిమర బోవలదా నే॥ పాడె॥
ఎండవానల - సైచి - తిండియైనను లేక - నాయందనుంటివి
గా - నాతండ్రి - నే॥ పాడె॥

14. రోహి—తిలంగ్ రాగము — ఆదితాళము.

జాగేలా - కావగా యిక॥ జాగే॥
కఠినతతగు నాబాలా - రంగ॥ జాగే॥
తామసింపనగునా - రంగా - రంగా రంగా యని
నేపిలువ - 'ఓ'యని యనవు నా బాలా - రంగ॥ జాగే॥

15. తుకా—ముఖారి—ఆదితాళము.

సంకల్పమే — మోకాని — రంగా — సంసారమే — సృజియింప॥ సీ॥
పంకేరుహా — ఆశీనుడైన — బ్రహ్మకైన
తెలియునో — తెలియదో॥ సంక॥

16. తుకా—కాంభోజి—ఆదితాళము.

భ్రాంతియొగా ఏ—కా—లంబునకే — యేబాధాజాలామాశ్రీ
లోలులీలా — ప్రాప్తంబానో — యేలాఖేదము — బేలా॥ భ్రాంతి॥
ఏరునుయిల - ధనపిపాసకున్ గుటియగుచు మనిరె
ఆకల్పాంతము కనుము - యెవరి - కెదియొ - యటులజరుగు
లలాటలిఖిత మునున్దాట - గలారెచెప్పుమ॥ భ్రాంతి॥

17. రోహి—రంగా - రంగా - పాండురంగా॥

18. రోహి—కన్నడ రాగము—జంపెతాళము.

భరమాయె - మాజాతి ధర మాలలనినంత - నిరసనము
సలిపి వెడలించెదరు - హా॥ భర॥
చేరంగజనరాదె - నీరమునకై బావి - మరలింతురదియే మొ
పురవీధులనుమసల - హా॥ భర॥

19. నీళ—శుద్ధసావేరి—ఆదితాళము.

పతియే — దైవము — భారతాంగనకు॥ పతి॥ శ్రీ॥
యితరదైవములనేలా — కొలువ॥ పతి॥
పతిరూపమే — మతిదలచితా
భక్తిగొల్పగా — ముక్తిబడయరే॥ పతి॥

**20.** రోహి — హిందుస్థానీ భైరవి — ఆది.

ఏమిఘోరమిది - ఏమిధర్మమిది - యేగతిమాకిక
యీజగతిని - హా ॥ ఏమి॥

పశువులపైనా - పక్షులపైనా - బలిపెడుదయయే
మాపైలేదా॥ ఏమి॥

పైరుపంటలకు - ప్రాధాన్యంబా
పంచమజాతియే హేయమా
సర్వజీవులను - సమతనుగాంచెడి - సర్వేశ్వరునకే
సహనములేదా॥ ఏమి॥

**21.** తుకారామ్— బారువరాగము—చాపుతాళము.

అచ్యుతా - కనవా - దయలేదా - కౌస్తుభా
అలంకార - హే - ప్రభో॥ అచ్యు॥
కఠినతచేనాకరమునద్రోయ
కటకటబడితో - ఎటుతాళితో
ఎటుబోయితో - భవబంధముబాప - జాగేలా
ఆదరణ - లే - దా - అచ్యుతా॥

**22.** తుకా—కాపీ—ఆదితాళము.

ఛత్రపతీ - హే రాజాధిరాజ॥ ఛత్ర॥
ధనమేప్రధానమ - ధరనాకిదేల
సరసిజదళనయనా - శ్రీనాథా ॥ ఛత్ర॥

23. గోపి—మాయామాళవగౌళరాగము—దాద్రతాళము.

ఏడీ — నాపాండురంగ డేడీ

ఏతావ్రుష్ణజనెనో .. తా॥ ఏడీ॥

24. తుకా—భీమపలాస్ రాగము—ఆదితాళము.

మంగళాంగునిచూడరే - హితులార॥ మంగ॥

వెనుకరె - నాదేవు - హా - దయామతి॥ మంగ॥

వ్యనధేలా - వసుదేవసూనుఁడు - యెటకుచనెనో

గయలేదె నాపై - యమునకు తా - నిపుడేగె

నో - చూడరే॥ మంగ॥

25. తుకా—

మంగళముమలకళా - గోపాలా॥

రంగశుభాంగ - సంగవిభంగ - సన్నుతమానిహృదంతరంగ॥

మంగళము.

అందఱు—మోహన—ఏకతాళము.

కమలా — నాభా — విమలవిభా — కమలావాసా

కలుషహారా — ప్రమదాభాసా — వరఫలదా — మానివిభావన

కారణసత్కగుణా — సుబ్రహ్మణ్యవందిత — కమలా॥

# ఈ దిగువ వివరించిన తిరుపతివేంకటేశ్వర కృతులు మాయొద్ద దొరకును.

| | | |
|---|---|---|
| దేవీభాగవతము 12 స్కం. 2 వాల్యూములు కాలికో. | 7 | 0 |
| గుంటూరుసీమ పూర్వభాగము | 1 | 0 |
| డిటో. ఉత్తరభాగము | 1 | 0 |
| గీరతము 1 భాగము | 1 | 0 |
| ,, 2 ,, | 0 | 12 |
| ,, 3 ,, | 0 | 10 |
| ,, 4 ,, | 0 | 8 |
| నానారాజసందర్శనము | 1 | 12 |
| కలగూరగంప | 0 | 14 |
| బుద్ధచరిత్ర | 1 | 4 |
| శ్రీనివాసవిలాసము | 1 | 0 |
| లక్షణాపరిణయము | 0 | 10 |
| పాణిగృహీత | 1 | 0 |
| ఏలామాహాత్మ్యము | 0 | 4 |
| బొబ్బిలిపట్టాభిషేకము | 1 | 0 |
| పాండవజననము | 0 | 9 |
| పాండవప్రవాసము | 0 | 14 |
| పాండవరాజసూయము | 0 | 5 |
| పాండవోద్యోగము (కృష్ణరాయబారము) | 1 | 0 |
| పాండవవిజయము | 1 | 0 |
| పాండవాశ్వమేధము | 1 | 0 |
| ప్రభావతీప్రద్యుమ్నము | 0 | 12 |
| అనర్ఘనారదము | 0 | 8 |
| దంభవామనము | 0 | 6 |
| సుకన్య | 0 | 5 |
| జయంతి | 0 | 12 |
| విక్రమచెళ్లపిళ్ల | 0 | 4 |

| | | |
|---|---|---|
| జాతకచర్య | 1 | 8 |
| స్వప్నఫలకణిక | 1 | 4 |
| ముద్రారాక్షసము | 0 | 12 |
| బాలరామాయణము | 1 | 8 |
| ఎడ్వర్డుపట్టాభిషేకము | 0 | 6 |
| సాహిత్యవిమర్శనము | 1 | 0 |
| విక్రమాంకదేవచరిత్ర | 0 | 12 |
| చంద్రప్రభచరిత్ర | 0 | 10 |
| హర్షచరిత్ర | 0 | 8 |
| దివాకరాస్తమయము | 0 | 12 |
| కామేశ్వరీశతకము | 0 | 4 |
| ఆరోగ్యకామేశ్వరీశతకము | 0 | 6 |
| ఆరోగ్యభాస్కరస్తవము | 0 | 4 |
| కాళికాదిస్తోత్రములు | 0 | 4 |
| కాళీసహస్రము | 0 | 8 |
| శుకరంభాసంవాదము | 0 | 4 |
| శనిగ్రహము | 0 | 2 |
| రసికానందము | 0 | 2 |
| తిట్టికొట్టు | 0 | 1 |
| భాగవతశేషములు | 0 | 3 |
| కవిసింహగర్జనములు | 0 | 2 |
| పునశ్శ్రవణము | 0 | 2 |
| శృంఖలాస్వీకరణము | 0 | 6 |
| గ్రామసింహము | 0 | 2 |
| మృత్యుంజయశతకము | 0 | 4 |
| వ్యసనవిజయము | 0 | 4 |
| లక్ష్మీనరసాపురపుశతావధానము | 0 | 2 |
| వేమవరాగ్రహారశతావధానము | 0 | 12 |
| శతావధానసారము | 0 | 12 |

శ్రీ తిరుపతివేంకటేశ్వర గ్రంథమాల, కొంకుదురు, తూ॥ గోదావరి.